


## సంపాదక వర్గం

సంపాదకుడు :
లయన్ కె.వి. గోవిందరావు,
బి.ఏ.,ఎల్ ఎల్.బి.
గౌరవ సహాయ సంపాదకులు ;
బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు,
ఎమ్ ఏ., విద్వాన్
వి. బాలకుమార్, ఎమ్.ఏ.,బి ఎల్
సభ్యులు :
కె.వి.ఎస్. గోవిందరావు,
బి.ఏ.,ఎల్ ఎల్.బి
కె.వి.ఎస్. శరత్‌బాబు,
బి.ఏ.,బి కామ్.,బి ఎల్
కె.వి.ఎస్. విజయకుమార్
కె. రత్నకుమారి


## చందా వివరాలు

| | |
|---|---|
| శాశ్వత చందా | 1,000.00 |
| జీవిత చందా | 250.00 |
| 3 సంవత్సరాలకు | 52.00 |
| సంవత్సర చందా | 18.00 |
| ఎయిర్ మెయిల్ (1 సంవత్సరం) | 80.00 |
| సీ మెయిల్ (1 సంవత్సరం) | 45.00 |


చందాలు పంపవలసిన చిరునామా :

విస్‌డమ్
9, దేశికా రోడ్డు, మైలాపూరు,
మద్రాసు-600 004


# ఈ సంచికలో

నవంబరు 1984





ముఖచిత్రం-కలర్ ట్రాన్స్‌పరెన్సీ :
శ్రీమతి మంజుల, ఘజియాబాద్ (యు.పి.)

**తెలుగు 'విస్‌డమ్'కు ఇది మూడవ సంవత్సరం**

## ధ్యానం

### 'జ్ఞాన' దీప్తి ముందు 'చెడు' మటు మాయం అవుతుంది



జేమ్స్ ఎలెన్

'చెడు' స్వతంత్ర శక్తే కనుక అయితే ఎవ్వరూ దానిని జయించ లేరు. కాని, వస్తుతః అది అయథార్థమైన శక్తి ఒక అనుభూతిగా, ఒక మానసిక స్థితిగా తాత్కాలికమైన అస్తిత్వం మాత్రమే దానికి ఉంది. అజ్ఞానంలో, పరిణతి చెందని దశలో కనిపించే మానసిక స్థితి—'చెడు'. చదువు వల్ల బాలుడి అజ్ఞానం తొలగిపోయినట్టు, సూర్యోదయం కాగానే చీకటి విచ్చిపోయినట్లు, జ్ఞాన దీపం వెలుగగానే 'చెడు' మటుమాయం అవుతుంది ●

## సంపాదకుని పేజీ

### 'నిరీక్షణ'ను ఫలప్రదం చేసుకోండి



ప్రతిరోజూ ఎంతోకాలం మనం నిరీక్షణలో గడుపుతూ ఉంటాం. ఎక్కడికి వెళ్ళినా 'నిరీక్షణ' తప్పని సరి అవుతూంది. ఒక్కొక్కప్పుడు నిరీక్షణకు అంతూ పొంతూ ఉండదు.. బస్సుకోసం నిరీక్షణ, రైలుకోసం నిరీక్షణ - ప్రతిదానికీ నిరీక్షణే! ఇలా ఎదురు చూడడం వల్ల కలిగే అలసట ఆరోగ్యాన్ని దెబ్బతీస్తుంది.

రోజూ క్యూలో గంటల తరబడి నిరీక్షించే స్త్రీ, పురుషుల ముఖాలలోకి చూడండి! వాళ్ళ సణుగుడు వినండి. వాళ్ళ విసుగువల అర్థం అవుతుంది. ఆఫీసుకి వెళ్ళడం, రావడంలో

"తను చెయ్యగలిగిందంతా బాహాటంగా అందరి ఎదుటా చెయ్యడమే నిజమైన ధైర్యం!" —లా రా చెఫా కాల్డ్

బోలెడు సమయం వృథా అవుతుంది. ఆసుపత్రులలో సుస్తీగా ఉన్న లేదా అవసాన దశలో ఉన్న మన బంధువుల బెడ్ పక్కన గంటలకొద్దీ కాలం గడపవలసి వస్తుంది. ఒక్కొక్కప్పుడు ఎంతో సేపు నిరీక్షించిన తరువాత ఆశించిన ఫలితం లభించక పోవడం కూడా కద్దు మనం ఎదురుచూస్తూ కూర్చున్న రైలు ఆ రోజు రద్దు అయినట్లు చివరికి తెలియవచ్చు. మనం ఎదురు తెన్నులు చూస్తున్న డాక్టరు ఏదో అర్జంటు పని తగిలి ఆ రోజు 'క్లినిక్' కి రాకపోవచ్చు. క్యూలో టిక్కెట్టు తీసుకునేందుకు తీరా మన వంతు వచ్చేసరికి సినీమా హాలు బుకింగ్ ఆపు చేసి కిటికీ మూసి వేయడం జరుగవచ్చు!

'నిరీక్షణ' అనే ఈ నరకయాతన వల్ల ప్రజలలో విసుగు పుడుతుంది. జీవితంలో

## పాత కాపీలు

జనవరి '82, మార్చి '82 నుంచి డిశంబరు '82, జనవరి '83 నుంచీ ఏప్రిల్ '83, జూన్ '83, డిశంబరు '83 మరియు జనవరి '84 నుంచీ జూన్ '84 కాపీలు మావద్ద ఉన్నవి. 1982 కాపీల వెల రూ. 9 లు. 1983 కాపీల వెల రూ. 5 లు, 1984 కాపీల వెల రూ. 7 లు. రిజిస్టర్డ్ పోస్ట్‌లో పొందడానికి కాపీల వెలతో పాటు రూ. 2-75 చేర్చి M.O. పంపాలి. "విస్‌డమ్", 9 దేశికా రోడ్డు, మద్రాసు - 600 004.

—సర్క్యులేషన్ మేనేజర్.

## బొమ్మలలో హాస్యం

పెళ్లి - ప్రెజంటేషన్స్

శాస్త్రిగారూ! పెళ్ళిముహూర్తానికి లగ్నం మొదటి వారంలో చూడండి. నెలాఖరులో అయితే ప్రెజంటేషన్స్ ఎక్కువ వచ్చి చావవు!



ఒక వ్యక్తి దేనికోసమో ఒకదానికోసం నిరీక్షిస్తూ గడిపిన సమయం మొత్తం లెక్కవేస్తే దాదాపు 5 సంవత్సరాల కాలం ఉంటుందంటే మీరు ఆశ్చర్యపోతారు!

సమ్మర్దం ఎక్కువగా ఉన్న ఒక సుప్రసిద్ధుడైన డాక్టర్‌గారి క్లినిక్‌లో గంటల తరబడి నిరీక్షించిన ఒక వృద్ధుడు ప్రాణం విసిగి చివరికి రిసెప్షనిస్ట్ దగ్గిరికి వెళ్ళి "తల్లీ! ఇంటికి పోయి సహజంగా ప్రాణాలు వదులు తాను!" అంటూ ఇంటిముఖం పట్టాడట!

ఈ రోజులలో ప్రతిచోటా 'నిరీక్షణ' తప్పనిసరి అవుతూంది గనుక ఒక సూక్తుల పుస్తకమో, జోక్‌ల పుస్తకమో, ఏదైనా హాస్య రచనో వెంట ఎప్పుడూ ఉంచుకోడం మంచిది. నరాల బిగువును సడలించడానికీ, మనస్సుకు ఆహ్లాదం కలిగించడానికీ అది

"కవిత్వంలో దేవుడి అంశ ఉంది; తన ప్రవక్తలను దేవుడు కవులుగా చేశాడు!" — కెంబెల్

తోడ్పడుతుంది. అంతేకాదు సంవత్సరం అయేసరికి వ్యర్థంగా గడిచే ఆ నిమిషాలలో మనం సాధించే విజ్ఞానం, మనస్సును ఉల్లాసంగా ఉంచుకోడంవల్ల మన ఆరోగ్యంలో కనిపించే మెరుగూ మనకే ఆశ్చర్యం కలిగిస్తాయి. అలాంటి సమయాలలో వెంట ఏ పుస్తకం లేదనుకోండి. అప్పుడు మామూలుగా మనం అంతగా పట్టించుకోని – మన చుట్టూ కనిపించే చిలర విషయాలను శ్రద్ధగా గమనించడం అభ్యాసం చెయ్యండి; సూక్ష్మ పరిశీలనశక్తిని పెంపొందించుకోండి. ప్రతి చిన్న విషయాన్నీ చూసి ఆశ్చర్య పడగల శక్తి మన జీవితాలను ఆనందమయం చేస్తుంది. ఒక ఆపిల్ చెట్టు క్రింద పడుకుని ఉన్న సర్ ఇజాక్ న్యూటన్‌కి చెట్టుమీదనుంచి తొడిమ ఊడి కిందపడిన ఆపిల్‌పండు ఎంత ఆశ్చర్యం కలిగించిందో గుర్తుకు తెచ్చుకోండి!

ఒక మంత్రిగారు ఒకవంక నిర్విరామమైన తన కార్యక్రమా లన్నిటినీ చక్కబెడుతూనే సంవత్సరం తిరిగేసరికి 3, 4 పుస్తకాలు వ్రాసి ప్రచురించే వాడట! ఒకసారి ఒక విజిటర్ "పుస్తకాలు వ్రాసే తీరిక కూడా మీకు ఎక్కడ ఉందండీ?" అని అడగ్గా, "ఇతరులు వ్యర్థంగా గడిపే నిమిషాలను నేను గ్రంథ రచనలో గడుపుతాను" అని ఆయన బదులు చెప్పాడట!

చిన్నపిల్లలు కూడా తమ 'నిరీక్షణ' నిముషాలలో చదివిన పద్యాలను మననం చేసుకుంటూనో, తాము వ్రాసి పెట్టుకొన్న నోట్స్‌ను చదువుకుంటూనో లాభదాయకంగా గడపవచ్చును.

మనలో చాలామందికి నిత్యం అన్నిపనులూ చక్కపెట్టేందుకు తగినంత తీరిక ఉండదు. అయినా నిరర్థకంగా గడిపే నిముషాలను సక్రమంగా వాడుకోగలిగితే మనకూ, సంఘానికీ కూడా అది ఎంతో మేలు చేస్తుంది. ●

## భూతల స్వర్గం



దేవుడు ఒక్కడే అంటాయి అన్ని మతాలూ
ఆయనకు అర్పిద్దాం రండి హారతులు
హిందూ, ముస్లిం, క్రైస్తవ సోదరులారా!
రండి రండి కీర్తిద్దాం దేవుణ్ణి నోరారా!

శాంతి, సామరస్యాలు మన హద్దు
మత విద్వేషాలూ, కలహాలూ మనకొద్దు
స్నేహ భావంతో అందరం కలసి జీవిద్దాం
మన భోగభాగ్యాలు అందరికీ పంచిద్దాం!

ఉన్నతాశయాలతో కలసి కృషిచేద్దాం
త్రికరణశుద్ధి మన జీవితాలలో సాధిద్దాం
అజ్ఞానాంధకారాన్ని లోకంనుంచి తరిమేద్దాం
వివేకాన్నీ, విజ్ఞానాన్నీ ఆహ్వానిద్దాం!

—డి. యస్. రామచంద్రన్.
(ఆంగ్ల రచనకు తెలుగుసేత: 'శ్రీమాన్')

"పరుల్ని గురించి మంచిగా ఆలోచించ లేకపోతే అసలు వారిని గురించే ఆలోచించకు!"

# భారత యోగులు

# రామకృష్ణ పరమహంస

డా॥ మను జి. భగత్

శ్రీ రామకృష్ణ పరమహంస అసలు పేరు గదాధరుడు. బెంగాల్‌లోని హుగ్లీ జిల్లాలో కామార్పుకూర్ అనే చిన్న పల్లెటూరులో 1836 లో ఒక మధ్య తరగతి బ్రాహ్మణ కుటుంబంలో ఆయన జన్మించాడు. తండ్రి ఖుదీరామ్ ఛటోపాధ్యాయ. తల్లి చంద్రాదేవి.



శ్రీరామకృష్ణ పరమహంస

గదాధరుడి ఏడో ఏటనే తండ్రి మరణించాడు. తొమ్మిదో ఏట అతనికి ఉపనయనం (వడుగు) అయింది. బడికి వెళ్ళి చదవడం, వ్రాయడం నేర్చుకున్నాడు నాటకాలలో వేషాలు వేయడం అన్నా, దేవతా విగ్రహాలు మలచడం అన్నా అతని కెంతో ఇష్టం. వాళ్ళ ఊరికి ఏ గాయక బృందం వచ్చి పురాణ కథలు వినిపిస్తున్నా వాళ్ళ ప్రదర్శనలు అన్నిటికీ అతడు హాజరు అయేవాడు. బళ్లో మేష్టర్ల కంటె పురాణాలూ, పురాణ కథలూ వినిపించే యోగులూ, సన్యాసులే ప్రధాన గురువులుగా అతడు పెరిగి పెద్దవాడయాడు.

తండ్రి చనిపోయిన తరువాత కుటుంబభారం నెత్తినబడ్డ వాళ్ళ పెద్దన్న రామ్‌కుమార్ 1849 లో కలకత్తా వెళ్ళాడు. సంస్కృతం బాగా చదువుకున్న వాడవడం వల్ల ఆయన అక్కడో సంస్కృత పాఠశాల తెరిచాడు. ఏదో గుడిలో పూజారిగా కూడా కుదిరాడు. చదువు కొనసాగించడానికీ, పనిలో తనకు కాస్త ఆసరాగా ఉండడానికీ గదాధరుణ్ణి ఆయన కలకత్తా పిలిపించాడు. కాని, సంసా

---

"తప్పులు మన్నించి సోదరుణ్ణి
ప్రేమించగల వారికే భగవంతుని అనుగ్రహం!" —జె. పి. వాస్వానీ

రిక విషయాల పట్ల గదాధరుడిలో ఎలాంటి ఆసక్తి కనిపించ లేదు. "చదువుకోరా నాయనా!" అని అన్నగారు అంటే, "ఈ పొట్టకూటి చదువువల్ల నాకేమిటి లాభం? ఈ చదువు నాకు దేవుణ్ణి చూపించగలదా? ప్రపంచంలోని దుఃఖాన్ని తగ్గించేందుకు ఇది తోడ్పడగలదా?" అని అతడు అడిగేవాడు.

రెండేళ్ళు గడిచాయి. రామ్‌కుమార్ ఆర్థిక పరిస్థితి నానాటికీ దిగజారుతూంది. కుటుంబ పోషణకు డబ్బు కావాలి. అందుచేత ఏదో ఒక ఉద్యోగంలో చేరక తప్పదు. అనతి కాలంలోనే గంగానది ఒడ్డున ఉన్న దక్షిణేశ్వరంలోని కాళికాదేవి ఆలయంలో పూజారిగా ఆయన నియమింపబడ్డాడు. కాళీమాతకు దుస్తులు వేసి అలంకారం చేసే పనిని ఆయన తమ్ముడు గదాధర్‌కి పురమాయించాడు. ఆ తరువాత కొద్దికాలానికే రామ్‌కుమార్ చనిపోవడం, గదాధరుడే ఆ ఆలయానికి పూజారి కావడం జరిగింది.

గదాధరుడికి కాళీమాత ఇష్టదైవం అయింది. అతని దృష్టిలో అది కేవలం ఒక రాతి విగ్రహం కాదు - నిజంగా అమ్మే! రోజూ ఎంతోసేపు ఆ విగ్రహం ముందు కూచుని జపాలూ, ప్రార్థనలూ చేసేవాడు. ఆమె దర్శనంకోసం తహ తహ లాడిపోయేవాడు. 'అమ్మ'ను చూడాలన్న అతని ఉత్కంఠ మరీ తీవ్రమై ఒక రోజున నిరాశతో కత్తిపెట్టి తన శిరస్సును ఖండించుకోడానికి తలపడ్డాడు అప్పుడు కాళీమాత అతనికి సాక్షాత్కరించింది. అతని ఆనందానికి అవ

# వేల్ చేపలు ఎందుకు ఒడ్డుకి కొట్టు కొస్తాయి?



1979 జూన్ నెలలో ఒక సాయంత్రం ఓరెగాన్ (అమెరికా) లోని ఫ్లారెన్స్ తీరానికి 41 స్పెర్మ్ వేల్ చేపల గుంపు ఒకటి ఒడ్డుకు కొట్టుకొచ్చి చావు కోసం ఎదురు చూస్తూంది. అమెరికాలోని 'వేల్' చేపల నిపుణులు ఒక్కొక్కటి 15 టన్నుల పైచిలుకు బరు ఉండే ఆ చేపలను తిరిగి సముద్రం మధ్య వదలాలని చేసిన ప్రయత్నాలన్నీ విఫలం అయాయి.

'ఎందుకు ఇలా వేల్ చేపలు గుంపులు గుంపులుగా ఒడ్డుకి కొట్టుకు వస్తాయి?' అనే ప్రశ్న 2,000 ఏళ్ళ క్రితం ఎంత జటిలంగా ఉండేదో నేటికీ అంత క్లిష్టంగానూ ఉంది. ఓరెగాన్ విశ్వ విద్యాలయంలో సముద్ర జంతు శాస్త్ర ప్రొఫెసర్ బ్రూస్‌మేట్ - అవి సంఘ జీవులనీ, ఒక గుంపుకి నాయకత్వం వహించే వేల్ చేప సుస్తీ వల్లనో, మరో కారణం వల్లనో ఒడ్డుకి కొట్టుకొస్తే ఆ గుంపులోని చేపలన్నీ ఆ నాయకుణ్ణి అనుసరిస్తాయనీ అంటున్నారు.

"గడచిన 300 ఏళ్ళలో 300 జంతు జాతులను తన అజ్ఞానంలో అంతరింప జేశాడు మనిషి!" —జె. నెవెల్

ధులు లేవు. ఆ తరువాత నిత్యం ఆ విగ్ర హంలో అతడు ఆమెను దర్శిస్తూనే ఉండే వాడు. ఎక్కడపడితే అక్కడే అతనికి కనిపించేది.



శారదా దేవి

ఉన్మత్తుడిలాగ అతడు ప్రవర్తించ సాగాడు. అతని 23 వ ఏట వాళ్ళ అమ్మ ఒత్తిడివల్ల 6 ఏళ్ళ శారదను అతడు వివాహం ఆడాడు. పెళ్ళి చేస్తే అయినా పిచ్చి కుదురు తుందేమో అని ఆ తల్లి ఆశ. కాని గదాధరుని పరిస్థితిలో పెళ్ళి వల్ల ఎలాంటి మార్పు రాలేదు.

ఆధ్యాత్మికానుభూతులలో గదాధర్ తనను తాను మరచిపోయేవాడు. అతి తేలికగా సమాధిలోకి వెళ్ళిపోయేవాడు. 'భైరవీ బ్రాహ్మణి'వద్ద శిష్యరికం చేస్తూ ఆయన తాంత్రిక సాధనలు చేశాడు. వేదాంత సాధనలో ఆయన గురువు తోతాపురి. 'నిర్వి కల్ప సమాధి' ఎలా సాధించాలో ఆయనవల్ల గదాధరుడు ఉపదేశం పొందాడు. త్వరలోనే సన్న్యాసం స్వీకరించి, 'రామకృష్ణుడు' అయాడు. 'ఇస్లామ్'. క్రైస్తవ మతం బోధించే బోధనలు కూడా ఆయన తెలుసుకున్నాడు. ఆ మతాల ద్వారా కూడా సాధనచేసి సిద్ధి పొందాడు. 'అన్నిమతాల గమ్యం ఒక్కటే' అని ఇప్పుడు ఆయనకు రూఢి అయింది. ఏ మతం అయినా ఒకే భగవంతుణ్ణి చేరుస్తుంది:

వేర్వేరు మతాల పద్ధతులలో సాధనచేసి సిద్ధి పొందడంతో ఆయనను అందరూ 'పరమ హంస' అనసాగారు. దేహం అవసరాలనూ, కోరికలనూ ఆయన పట్టించుకోడం మానే శాడు. లైంగిక ప్రవృత్తి అర్థం లేనిదిగా ఆయనకు కనిపించింది అప్పటికి 18 ఏళ్ళ వయస్సు వచ్చిన ఆయన భార్య కాపురానికి వచ్చింది. కాని, స్త్రీలు అందరూ తన దృష్టిలో 'అమ్మ' లాగే కనిపిస్తారని ఆమెకు ఆయన స్పష్టం చేశాడు. ఆమెనూ 'అమ్మ' గానే చూస్తా నన్నాడు. "ధర్మాచరణలో మీకు సహచరిణిగా ఉండడానికి వచ్చాను గాని విఘ్నం కలిగించడానికి నేను రాలే"దని ఆమె

## పోకెట్ సైజు కలర్ టి.వి.

జపాన్‌లో 2 అం.ల చదరం 'లిక్విడ్ క్రిస్టల్ స్క్రీన్'తో తయారైన మొట్టమొదటి పోకెట్ సైజు కలర్ టీ వీ. సెట్‌ను అమెరికాలో 500 నుంచి 550 డాలర్ల ధరకు అమ్ముతున్నారు. 450 గ్రాముల బరువున్న ఈ టీ.వీ. సెట్ కొలతలు 16 × 8 × 3.1 సెం.మీ.లు

"'తెలుసుకోడం' కంటె 'ఆలోచించడం' మరింత ముఖ్యం:" —ఐన స్టీన్

బదులు చెప్పింది.

ప్రపంచంలో అతి విచిత్రమైన 'భార్యా-భర్త'ల సంబంధం ఆ విధంగా వారి సంసారంలో ప్రారంభం అయింది. భార్యకు భర్త గురువు అయాడు. భర్తకు భార్య 'అమ్మ' అయింది. కన్నతల్లికీ, కట్టుకున్న భార్యకూ మధ్య రామకృష్ణుని దృష్టిలో ఎలాంటి తేడా లేదు. ఆధ్యాత్మిక సాధనా మార్గంలో రామకృష్ణ పరమహంసా, శారదా దేవీ సహ యాత్రికులు అయారు. సాధన మార్గంలో అది ఆఖరి మెట్టు!

సమాజంలో అన్ని వర్గాలవారూ - ధనికులూ, పేదలూ, యువకులూ, వృద్ధులూ— అందరూ రామకృష్ణుని ఆశీస్సులు పొందడానికి వచ్చేవారు. ఆయన నోటి వెంట వచ్చే ప్రతిమాటనూ భగవద్వాణిగా భావించి పూలు అందుకున్నంత పదిలంగా స్వీకరించేవారు. ఒకప్పుడు పిచ్చివాడు అని నిరసించిన లోకమే ఇప్పుడు ఆయన పాదాలవద్ద మోకరిల్లింది.

ఒకరోజున కళాశాల విద్యార్థి అయిన 'నరేంద్రనాథ్' అనే యువకుడు రామకృష్ణ పరమహంస వద్దకు వచ్చాడు. దేవుణ్ణి ముఖాముఖీగా చూసినవారూ, స్వంత అనుభవంలో సత్యాన్ని దర్శించినవారూ ఎవరైనా కనిపిస్తారా అని ఆయన అన్వేషిస్తున్నాడు. దేవుణ్ణి గూర్చిన తీవ్ర సంశయాలతో అప్ప

(మిగతా 57 వ పేజీలో)

## శత దినోత్సవం చేసుకోబోతున్న 'లిబర్టీ' ప్రతిమ



న్యూయార్క్ (అమెరికా) హార్బర్‌లోని ప్రపంచ ప్రసిద్ధమైన కాగడా చేతిలో పుచ్చుకున్న 'మిస్ లిబర్టీ' ప్రతిమను స్థాపించి 1986 జూలై 4వ తేదీ నాటికి 100 ఏళ్ళు నిండుతాయి. 200 టన్నుల రాగిని చేతి సుత్తితో సాగగొట్టి రూపొందించిన ఈ ప్రతిమ రేకు దళసరి 2 పెన్నీ నాణేలంత ఉంటుంది. 1886లో ఫ్రాన్స్ బహూకరించిన ఈ ప్రతిమకు శతవార్షికోత్సవం నిమిత్తం ప్రస్తుతం 3.9 కోట్ల డాలర్ల ఖర్చుతో జీర్ణోద్ధరణ కార్యక్రమం కొనసాగుతూంది. 1986 అక్టోబరు 28న దీనిని తిరిగి ఆవిష్కరిస్తారు. 'ఏటా ఈ ప్రతిమను సందర్శించే సుమారు 20 లక్షలమంది యాత్రికుల సౌకర్యంకోసం ఈ ప్రతిమ లోపలి భాగాన్ని మళ్ళీ కొత్తగా డిజైన్ చేస్తున్నారు.'

# ప్రథమాంధ్ర కవి నన్నయ భట్టు

డా॥ ఏ. ఎస్. రామన్



[బొంబాయిలోని 'ది ఇలస్ట్రేటెడ్ వీక్లీ ఆఫ్ ఇండియా' పత్రికకూ, మద్రాసులోని 'స్వరాజ్య' అనే ఇంగ్లీషు వారపత్రికకూ మాజీ సంపాదకులైన డా॥ ఏ. ఎస్. రామన్ ప్రస్తుతం తంజావూరులోని తమిళ విశ్వవిద్యాలయంలో 'లలిత కళల' విభాగంలో 'డీన్'గా ఉన్నారు. సాహిత్యం మీదా, లలితకళల మీదా ఆయన అభిప్రాయాలు ప్రామాణికాలుగా గుర్తింపు పొందాయి.]

తెలుగు భాష చాలా ప్రాచీనమైంది. తొలి రోజులనాటి తెలుగు భాషా స్వరూపాన్ని తెలిపే రచనలు ఇప్పుడు లభించకపోయినా, అది ఇంచు మించు తమిళం అంత ప్రాచీనం: అయితే ఇండియాలోని ప్రముఖ భాషలలో ఒకటి అయిన తెలుగు భాష తాలూకు విశిష్టత దాని ప్రాచీనతలో లేదు: దాని పద లాలిత్యం లోనూ, మాధుర్యం లోనూ, గాంభీర్యం లోనూ, భావప్రకటనశక్తిలోనూ ఉంది. తరతరాలుగా ఎందరో మహా కవులకూ, మహా గాయకులకూ భావప్రకటన మాధ్యమంగా ఉపయోగపడిన తెలుగుభాష ప్రపంచం నలుమూలల నుంచీ విద్వాంసుల ప్రశంసల నందుకుంది. హిందీ తరువాత ఇండియాలో ఎక్కువమంది మాట్లాడే భాష తెలుగు భాషే:

తెలుగు సాహిత్యం మాత్రం మరీ ప్రాచీనమైంది కాదు. 11 వ శతాబ్దంలో నన్నయభట్టు (1023-1063) ఆ నాడు వ్యవ

---

## చైనాలో మిక్కిలి పెద్ద హొటల్

చైనా అంతటిలోకీ మిక్కిలి పెద్దదైన 'ది గ్రేట్ వాల్ హోటెల్'కు ఇటీవలనే ప్రారంభోత్సవం జరిగింది 7.5 కోట్ల డాలర్ల వ్యయంతో ఒక అమెరికన్ కంపెనీ సహకారంతో నిర్మించబడిన ఈ హోటల్ భవనంలో 22 అంతస్తులూ, 1,007 గదులూ ఉన్నాయి.

---

"మానవ జాతిలో నమ్మకం కోల్పోకు; సముద్రంలో కొన్ని బిందువులు కలుషితం అయితే సముద్రం అంతా కలుషితం కాదు." —మహాత్మా గాంధి

హారంలో ఉన్న ప్రాకృత జన్యాలైన వివిధ మాండలిక భాషల నుంచి ఒక కవిత్వ భాషను సృష్టించి, ఆ భాషలో మహాభారత రచనకు పూనుకోడంతోనే తెలుగు సాహిత్యానికి అంకురార్పణం జరిగింది. సంస్కృత మహాభారతంలోని తొలి పర్వాలను తను సృష్టించిన ఆ కొత్త భాషలో అవతరింపజేయడం వల్లనే నన్నయ తెలుగులో ఆదికవి అయారు 'అనువాద కుణ్ణి కవి అనవచ్చునా?' అంటే నిజానికి తెలుగు మహాభారతం కేవలం అనువాదం కాదు; విలక్షణమైన ప్రత్యేక వ్యక్తిత్వంతోనూ, స్వారస్యంతోనూ కూడిన భాషాంతర సృష్టి అది. 'కవి త్రయం'గా సుప్రసిద్ధులైన నన్నయ, తిక్కన, ఎర్రనలు తమ స్వంత ప్రతిభతో సంస్కృత మూలంలోని ఎన్నో భాగాలకు తెలుగులో మెరుగులు దిద్దారని విమర్శకులందరూ ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నారు. కవిత్రయం వారికి సంస్కృతం అంటే ఎంత గౌరవమో, తెలుగు భాష అంటే అంత ఆదరం!

సంస్కృత, ప్రాకృత భాషలలో నిష్ణాతుడైన నన్నయభట్టు తన కవిత్వ భాషకు ఆ రెంటిలో ఒకదానిని ప్రాతిపదిక (పునాది) గానూ, రెండవ దానిని మీది నిర్మాణంగానూ గ్రహించారు. సాంప్రదాయికమైన ఒక వైదిక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన నన్నయ రాజరాజ నరేంద్రుడు పాలించిన స్వర్ణయుగంలో జీవించారు. చాళుక్య చక్రవర్తి రాజరాజ నరేంద్రుని రాజధాని రాజమహేంద్రవరం.



నన్నయభట్టు

రాజరాజ నరేంద్రుని కొలువులో ముగ్గురు ఆస్థాన కవులు ఉండేవారు. వారు: నారాయణ భట్టు, పావులూరి మల్లన్న, నన్నయభట్టు. మంచి చెడ్డల విచక్షణ, ఉత్తమ కళాభిరుచి గల గొప్ప కళా పోషకుడు రాజరాజ నరేంద్రుడు. సంస్కృతంలో వేదవ్యాసుడు రచించిన మహా భారతం తెలుగులో అవతరించడం అత్యావసరం అని ఆయనకు అనిపించింది. ఆయన దృష్టిలో మహాభారతం గొప్ప సాహిత్య గ్రంథం, వేదాంత గ్రంథం మాత్రమే కాదు; రాజులూ, పాలకులూ అభ్యసించవలసి ఉన్న ఉదాత్త రాజనీతి సూత్రాలకూ, ఉన్నత నైపుణులకూ ప్రామాణికమైన గ్రంథం అది. బ్రాహ్మణుడుగా జన్మించి బ్రాహ్మణత్వం పట్ల అధికాదరం కలవాడైనా నన్నయగారు సూక్ష్మాతి సూక్ష్మమైన రాజనీతి రహస్యాలు కూడా ఎరిగినవారు. అందుచేత

---

భాష అత్యద్భుతమైంది; మన ఆలోచనలు ప్రకటించడానికీ, దాచుకోడానికీ కూడా అది తోడ్పడుతుంది." —జానీ మార్టిన్

చక్రవర్తి సంకల్పించినకార్యాన్ని నిర్వహించ గల అర్హత లన్నీ ఉన్నవాడు ఆయన ఒక్కరే కనిపించారు। అయితే - ఆ కార్యం అంత తేలికగా నిర్వహించడానికి వీలైంది కాదు. అంతకు ముందు రూపురేఖలు ఏర్పడి ఉండని ఒక కొత్త భాషలో ఆ కావ్యం వ్రాయాలి. ప్రాకృతంలో 'గాథా సప్తశతి'ని కూర్చిన శాతవాహన చక్రవర్తి హాలుని (క్రీ.శ. 1వ శతాబ్ది) నాటి నుంచీ వ్యవహారంలో ఉన్న తెలుగుభాష నిజానికి స్థానిక అవసరాలకు అనుగుణంగా మలచుకోబడిన ఒక రకమైన ప్రాకృత భాషే। అందువల్ల సంపన్నమైనప్పటికీ గ్రామీణ రూపంలో ఉన్న ఆ భాషకు నన్నయగారు ముందుగా ఒక స్పష్టమైన రూపకల్పన చేసుకోడం అవసరం అయింది. నన్నయగారి చేతిలో ఆ విధంగా సంస్కృతం అంత గంభీరమూ, ఉదాత్తమూ అయిన — అయినా ఒక ప్రత్యేక వ్యక్తిత్వం గల — ఒక కొత్త భాష రూపొందింది. అందుచేత నన్నయగారిని 'వాగనుశాసనుడు' (తాను సృష్టించిన క్రొత్తభాషకు వ్యాకరణం రచించిన వాడు) అని గౌరవించడంలో ఆశ్చర్యం లేదు. అయితే విద్వాంసులలో కొందరు నన్నయ్య రచించినట్లు చెప్పబడుతున్న 'ఆంధ్ర శబ్ద చింతామణి' ఆయన వ్రాసింది కాదు అంటున్నారు. అయితే సంస్కృత శ్లోకాలలో ఆయన ఒక తెలుగు వ్యాకరణం రచించా డని మాత్రం అందరూ అంగీకరిస్తున్నారు. తెలుగుభాషకు ఆయన ఒక రూపాన్ని కల్పించడమే కాదు; దానికి ప్రాణప్రతిష్ఠ చేసి తన మహాభారత రచనతో అద్భుతంగా ఆ భాషను అలంకరించారు.

ప్రధానంగా నన్నయ ఏ సూత్రాలకూ కట్టుబడని సృజనాత్మక రచయిత (creative writer). నియమాలే ఆయనను అనుసరిస్తాయి. వివిధదృశ్యాల వర్ణనలలోనూ, వివిధ

## టైప్ రైటర్‌ల మ్యూజియమ్




మాస్కోలోని బోరిస్ బుల్కిన్ అన్ని రకాల టైప్ రైటర్‌ల మోడల్ లనూ సేకరించి భద్రపరిచారు. 1879 లో తయారైన ఒక రెమింగ్టన్ మెషీన్‌లో 'కీ బోర్డ్' కొయ్యతో నిర్మింప బడింది. ఆరంభంలో - 'సూచిక' అయిన బాణం గుర్తును మనం కొట్ట దలచుకున్న అక్షరం వద్దకు తెచ్చి అప్పుడు ఆ 'కీ'ని నొక్కవలసి వచ్చేది. అలా ఎంతో సమయం వృథా అయేది. కెమిస్ట్‌లు వాడే ఒక మెషీన్‌లో రష్యన్, లాటిన్ టైప్‌లు రెండూ ఉండేవి. ప్రిస్క్రిప్షన్‌లు టైప్ చెయ్యడానికి అవి బాగా ఉపయోగించేవి.

"మంట ఆర్పేందుకు నీరుంది; వానకూ, ఎండకూ గొడుగుంది,
జబ్బు వస్తే మందుంది, మూర్ఖత్వానికి మాత్రం విరుగుడు లేదు"

పాత్రల, రసాల ఆవిష్కరణలోనూ పూర్తి స్వాతంత్ర్యాన్ని ఆయన ప్రదర్శించారు.

వ్యాసుడు వ్రాసిన 18 పర్వాల సంస్కృత భారతాన్నీ తెలుగులో వెలయించ మని, రాజ రాజ నరేంద్రుడు ఆయనకు ఒప్పగించిన పనిని తన హ్రస్వ జీవితంలో నన్నయ పూర్తి చేయలేకపోయారు. ఆది, సభా పర్వాలు మాత్రం పూర్తిగా వ్రాసి, అరణ్యపర్వం సగంలో ఉండగా ఆయన దేహం చాలించారు. ఆ తరువాత 3 శతాబ్దాలకు ఎర్రన గారు పుట్టి నన్నయ రచనే అనిపించేట్టుగా ఆ అరణ్యపర్వాన్ని పూరించారు. నాలుగోదైన విరాటపర్వం మొదలు 18వ పర్వం దాకా గల 15 పర్వాలనూ తిక్కన సోమయాజి (13 వ శతాబ్ది) రచించారు. తెలుగులో అంతటి మహాకవి మరొకడు లేడని తిక్కన గారు ప్రసిద్ధి పొందారు.

గద్య పద్యాలతో కూడిన 'చంపూ' పద్ధతిలో నన్నయ భారతం వ్రాశారు. ఆయన రచనలో రసపుష్టి, పదప్రయోగ దక్షత కనిపిస్తాయి. ఆయన శైలిలో కనిపించే ప్రధాన లక్షణాలు: స్పష్టత, పవిత్రత, సంయమంతో కూడిన అర్ధ్రత. అవసరం అనుకున్న సందర్భాలలో సంస్కృత పదాలను యథేచ్ఛగా ఆయన వాడుక చేశారు.

నన్నయ మహాభారత భాగంలో ఆది పర్వంలోని 'వాసుకి మాకు ప్రసన్ను డయ్యెడున్' అనే మకుటంతో సాగిన నాలుగు పద్యాలనూ చదువుకుంటే సర్పాలవల్ల భయం ఉండ దని ఈరోజుకీ తెలుగుప్రజల నమ్మకం. వ్యాకరణ పండితుడే అయినా జటిలమైన శైలిని నన్నయ వాడలేదు. ఋషికి ఉండే అంతర్దృష్టి, కవికి ఉండే రస దృష్టి-రెండూ నన్నయలో కనిపిస్తాయి.

మహాభారతం మాత్రమే కాక నన్నయ గారు 'చాముండికా విలాసం', 'ఇంద్ర విజయం', 'లక్షణ సారం' అని మరో మూడు రచనలు కూడా చేశారు. మొదటి రెండూ మాత్రమే లభించాయి మూడోది లభించలేదు. నేటికీ తెలుగు కవు లందరూ కవితకు ఉపక్రమించేందుకు ముందు కవిత్రయం అయిన నన్నయ, తిక్కన, ఎర్రన లను భక్తితో సంస్మరిస్తారు నన్నయగారి సహస్ర వార్షిక జయంతి ఉత్సవాలు ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ యాజమాన్యంలో 1983లో మొదట రాజమండ్రిలోనూ, తరువాత హైద్రాబాద్‌లోనూ మహా వైభవంగా జరిగాయి.

(నన్నయ చిత్రం కలకత్తా ఆంధ్రసంఘం వారి సావనీర్ నుంచి గ్రహించబడింది.)

## ఖాదీ టోపీ-నెహ్రూ చలోక్తి

ఒకప్పుడు అహమ్మదాబాద్‌లో జరిగిన ఒక కాంగ్రెసు వర్కింగ్ కమిటీ మీటింగ్‌లో ఖాదీ దుస్తులు ధరించి ఉన్న సభ్యుల నుద్దేశించి మాట్లాడుతూ జవహర్ లాల్ నెహ్రూ ఇలా అన్నారు: "ఖాదీ టోపీ అంటే నాకు గౌరవమే! అయితే ఖాదీ టోపీ కంటె దానిని ధరించే తల మరింత ముఖ్యం. ఆ టోపీ ధరించే వారందరూ స్వయంగా ఆలోచించ గలవారై ఉండాలి."

---

"నిజమైన స్నేహితుడు మనస్సు విప్పి మాట్లాడుతాడు,
చక్కని సలహా నిస్తాడు. కష్టాల్లో ఆదుకుంటాడు!" —విలియమ్ పెన్

# స్పాట్‌లైట్

## 'లాస్ ఏంజెల్స్' ఒలింపిక్ క్రీడలు

కాలిఫోర్నియా (అమెరికా) లోని లాస్ ఏంజెల్స్ (దేవతల నగరం) ఇటీవల జూలై 28 నుంచి ఆగస్టు 12 దాకా జరిగిన అంతర్జాతీయ ఒలింపిక్ ఆటల పోటీలకు రంగస్థలమై



'జంతు లాంఛనం' (Mascot)

ప్రపంచ దృష్టిని ఆకర్షించింది. లోగడ 1932 లో ఒకసారి ఈ నగరంలో ఒలింపిక్ క్రీడల పోటీలు జరిగాయి. 52 ఏళ్ళ అనంతరం మళ్ళీ ఆ పోటీలు నిర్వహించే అదృష్టం ఆ నగరానికి పట్టింది.

మొట్టమొదటిసారిగా ప్రభుత్వ ప్రమేయం లేకుండా పూర్తిగా ప్రైవేట్ పరిశ్రమల, విడి వ్యక్తుల పెట్టుబడితోనే ఈ సారి లాస్ ఏంజెల్స్‌లో ఒలింపిక్ క్రీడలు నిర్వహించ




ఒలింపిక్ చిహ్నం

బడ్డాయి. 'లాస్ ఏంజెల్స్ ఒలింపిక్ ఆర్గనైజింగ్ కమిటీ' ఆధ్వర్యంలో ఈ క్రీడలు జరిగాయి. ఆ కమిటీ అధ్యక్షుడు పీటర్ వీ. ఉబెర్రోత్.

వాల్ట్ డిస్నీ ప్రొడక్షన్స్ వారు డిజైన్ చేసిన ఒలింపిక్ ఈగిల్ (గ్రద్ద) 'శాంటీ శామ్' ఈ సారి అధికారిక 'జంతు లాంఛనం (mascot). 'ఈగిల్' అమెరికా వారి

"తెలిసిన ఇంటినీ, ఊరినీ ప్రేమించలేని వాడు
తెలియని 'మానవ జాతి'ని ఎలా ప్రేమించగలడు?" —విలియమ్ రాల్ఫ్ ఇంగె

జాతీయ పక్షి. "మరింత వేగంగా, మరింత ఎత్తుగా, మరింత బలంగా" అనే ఒలింపిక్ ఆశయ వాక్యానికి ఇది ప్రాతినిధ్యం వహిస్తుంది. ఎరుపు, నీలం రంగుల 'కదిలే నక్షత్రం' ఈసారి అధికారిక చిహ్నం (emblem). వేగాన్నీ, పోటీ స్వభావాన్నీ అది సూచిస్తుంది.




లాస్ ఏంజెల్స్ కొలీసియమ్

8.000 పైచిలుకు పత్రికా విలేఖరులూ, ఫొటోగ్రాఫర్లూ, రేడియో, టెలివిజన్ రిపోర్టర్లూ, 140 దేశాల నుంచి వచ్చిన (ఇది రికార్డు సంఖ్య) 7,800 క్రీడాకారులూ, 3,600 ఉద్యోగులూ ఈ క్రీడలలో పాల్గొన్నారు. మొత్తం 21 క్రీడలలోనూ, మరి కొన్ని నైపుణల (disciplines) లోనూ పోటీలు జరిగాయి. మొత్తం 80,000 మంది అతిథేయులు (hosts)గానూ, గైడ్లుగానూ, దుబాసీలుగానూ పనిచేశారు.

ప్రారంభోత్సవం సందర్భంలో 'లాస్ ఏంజెల్స్' మెమోరియల్ కొలీసియమ్‌లో 7,800 మంది క్రీడాకారుల పెరేడ్‌తో పాటు దేశం నలు మూలలనుంచీ ఆహూతులైన 10,000 మంది సుప్రసిద్ధ గాయకుల, నర్తకుల ప్రదర్శన కూడా జరిగింది.

జూలై 28 న అమెరికా అధ్యక్షులు రోనాల్డ్ రీగన్ 92,516 సీట్లు ఉన్న ఆ ప్రాచీన 'కొలీసియమ్'లో 23 వ అంతర్జాతీయ ఒలింపిక్ ఆటల పోటీలకు ప్రారంభోత్సవం చేశారు. ఆ కొలీసియమ్ సీట్లను బారుగా ఒకదాని ప్రక్కన ఒకటిగా పేర్స్తే 50 కి.మీ.ల పొడవు వరుస అవుతుంది. 120 దేశాలలోని 250 కోట్ల మంది - అంటే

## భావపరిచయ పోటీ

(సెప్టెంబరు 1984)

"వ్యసనానికి బానిస కాకు!
ధ్యానంలోనే మునిగిపోకు!"
—కె. పవన్‌కుమార్, కరీంనగర్.

* * *

"చీకు చింతలతో మార్పియాకు
బానిస పయ్యేకన్నా
మనశ్శాంతికై జపము చేయడం మిన్న!"
—ఎస్. మధుసూధనరావు, వసుంధర.

* * *

"మరుగకు మాదక ద్రవ్యాన్ని!
మరువకు కర్తవ్యాన్ని!!
—కోవూరి రవికుమార్, తెనాలి.

"మనిషికి ఉన్నదాని కంటె, అతడు చేసిన దాని కంటె
అతడు ఎలాంటి వాడో అతని విలువ నెక్కువగా చెబుతుంది." —అమీల్

ప్రపంచ జనాభాలో సగం పైచిలుకు - ఆ ప్రారంభోత్సవ వైభవాన్ని టెలివిజన్ తెర మీద కళ్ళారా సందర్శించారు.

మానవ శక్తి మహత్తును నిరూపించే ఒలింపిక్ పోటీలు ఇప్పటికి మొత్తం 314 సార్లు జరిగాయి. ఈ పోటీలకు సుమారు 1200 సం. ల చరిత్ర ఉంది. ఎలిస్‌కి చెందిన ఇఫిటాస్ రాజు 'డెల్ఫీ' గణాచారి (oracle)



బేరన్‌పీరె డి కోబెర్టిన్

తో సంప్రదించి, మొట్టమొదటిసారి క్రీ.పూ. 776 లో గ్రీస్‌లోని ఒలింపియాలో ఈ పోటీ లను ప్రారంభించారు యుద్ధాలతో సతమత మవుతున్న గ్రీస్ దేశానికి శాంతి చేకూర్చడం ఆ పోటీల ప్రధాన లక్ష్యం. అనంతరం 1,170 ఏళ్ళపాటు ప్రతి నాలుగేళ్ళకూ ఒక సారి ప్రత్యేకంగా నిర్మించబడిన ఒక క్రీడా రంగంలో ఈ పోటీలు అవిచ్ఛిన్నంగా నిర్వ హించబడుతూ వచ్చాయి.

కాలక్రమేణ గ్రీక్ నాగరకత క్షీణించి ఒలింపిక్ క్రీడలకు విలువలేకుండా పోయింది. క్రీ.శ. 67 లో రోమన్ చక్రవర్తి నీరో, ఈ పోటీలలో జడ్జీలకు లంచం పెట్టేందుకు ప్రయత్నించాడు క్రీ.శ. 394 లో రోమన్ చక్రవర్తి మొదటి థియొడోసియస్ ఈ పోటీ లకు స్వస్తి చెప్పాడు.



ఉల్‌రికెమేపార్త్

ఆ తరువాత 1500 ఏళ్ళకు మళ్ళీ ఈ ఒలింపిక్ క్రీడల పునరుద్ధరణ జరిగింది. 1892 నవంబరు 25 న ఫ్రెంచ్ ప్రభువు, ఆధునిక ఒలింపిక్ క్రీడల స్థాపకుడు అయిన 'బేరన్ పీరె డి కోబెర్టిన్' "ఒలింపిక్ క్రీడ లను పునరుద్ధరించాలని నేను కోరుతున్నాను" అని ప్రకటించాడు 1896 లో అచ్చమైన గ్రీక్ సంప్రదాయంలో గ్రీస్ రాజధాని నగరం ఏథెన్స్‌లోనే ఈ ఒలింపిక్ క్రీడల పునరుద్ధరణ జరిగింది. ఆనాటి గ్రీస్ రాజు జార్ ఆదరణ వాటికి లభించింది. ఆ ఒలిం పిక్ క్రీడల్లో మిక్కిలి శ్రమతో కూడిన 'మరాథన్' పరుగుపందెం 'అమరోప్పియస్'

"దేవుణ్ణి గూర్చిన 'ప్రకటన' కంటె 'భావన' నిజం;
'భావన' కంటె ఆయన 'ఉనికి' మరింత నిజం!" — సెంట్ అగస్టిన్

అనే గ్రీక్ గ్రామానికి చెందిన స్పైరోస్ లూయీ అనే గ్రీక్ యువకుడు గెలవడం గ్రీక్‌ల కందరికీ ఆనంద దాయకం అయింది. క్రీ పూ. 490 లో 'మరాతన్' లోని యుద్ధ రంగం నుంచి మధ్యలో ఒక్క క్షణంకూడా నిలువకుండా ఏతెన్స్ దాకా 40 కి మీ. ల దూరం ఏక ధాటీన పరుగెత్తి పర్షియన్‌లను గ్రీక్‌లు జయించిన శుభవర్తమానం తెలియ చేసిన ఫైడిప్పిడీస్‌ను స్మరించుకోడం కోసం ఈ 'మరాతన్' పందెం మొదట ఏర్పాటయింది.



కార్ల్ లూయీ

1896 నుంచీ ప్రతి 4 ఏళ్ళకూ ఏదో ఒక నగరంలో ఈ ఒలింపిక్ పోటీలు జరుగుతూ వచ్చాయి. అయితే — ప్రథమ, ద్వితీయ ప్రపంచ సంగ్రామాల కాలంలో 1916, 1940, 1944 సం లలో జరుగవలసి ఉన్న పోటీలను మాత్రం రద్దు చేయవలసి వచ్చింది. ఒక డొమినికన్ సన్యాసి అన్న "సిటియస్, ఆల్టియస్, ఫోర్టియస్" (మరింత వేగంగా, మరింత ఎత్తుగా, మరింత బలంగా) అనే పదబంధం ఈ క్రీడల ఆశయ వాక్యం (motto) గా గ్రహించబడింది.

1984 'లాస్ ఏంజెల్స్' ఒలింపిక్ పోటీలు విజయవంతంగా ముగిశాయి. అవి ప్రధానంగా కార్ల్ లూయీ (అమెరికా) అనే క్రీడాకారుని ఘనతను చాటిన పోటీలు అనవచ్చు. 1936



డాలీ థాంప్సన్

లో బెర్లిన్‌లో జరిగిన పోటీలలో జెస్సీ ఓవెన్స్ సాధించిన విజయాన్ని —100 మీ. లు, 200 మీ లు పరుగు పందేలలోనూ, లాంగ్ జంప్, 4 × 100 మీ ల రిలే పరుగు పందెంలోనూ మొత్తం 4 స్వర్ణపతకాలు గెలుచుకోడం అనే ఘనతను—ఈ పోటీలలో కార్ల్ లూయీ తిరిగి సాధించాడు.

డెకాత్‌లాన్ పోటీలో 26 ఏళ్ళ బ్రిటిష్ జాతీయుడు డాలీ థాంప్సన్ 8,797 పాయింట్లు సాధించి ఇంతకు ముందు 1976 మాంట్రీల్

(మిగతా 53 వ పేజీలో)

"సహజ ప్రతిభ లేని చదువు కంటె
చదువులేని సహజ ప్రతిభ ఎక్కువ రాణిస్తుంది!" —సిసిరో

# వేగంగా చదవడం ఎలా ?

## ఆర్. పంచనాథన్



[1942 ఏప్రిల్ 22 న జన్మించిన శ్రీ పంచనాథన్ విద్యార్థి దశలోనే అసాధారణమైన ప్రతిభ ప్రదర్శించారు. ప్రస్తుతం తిరుచిరాపల్లి లోని జమాల్ మహమ్మద్ కాలేజీలో ఆయన ఇంగ్లీషు ప్రొఫెసర్‌గా ఉన్నారు. కాలేజీ విద్యార్థుల వ్యక్తిగతాభివృద్ధికి దోహదం చేసే 'జేసీస్' వారి ప్రొజెక్ట్ అయిన 'తిరుచ్చి నాయకత్వ శిక్షణ సంస్థ' వ్యవస్థాపకులలో ఆయన ఒకరు.]

సృష్టిలోని ఇతర ప్రాణుల లాగ కాకుండా తన జీవితాన్ని మెరుగుపరచుకునేందుకు ఉద్దేశపూర్వకంగా కృషిచెయ్యడం మానవుడికి గల విశిష్టమైన వరం. దేహానికి వ్యాయామం ఎలాంటిదో మనస్సుకు గ్రంథపఠనం అలాంటిది. "గ్రంథపఠనం వల్ల మనిషి పరిపూర్ణుడవుతాడు" అని ఫ్రాన్సిస్ బేకన్ ఊరికే చెప్పలేదు. జీవితాన్ని ఎదుర్కొనేట్టు 'విద్య', గడ్డుసమస్యల నెదుర్కొనేట్టు 'తెలివి' మనిషిని తయారుచేస్తాయి. దీనివల్ల గ్రంథపఠనం ఎంత ముఖ్యమో బోధ పడుతుంది.

పోటాపోటీలతో ముందుకు సాగే ప్రస్తుత ప్రపంచంలో రోజూ 10,000 పైచిలుకు పుస్తకాలు కొత్తగా అచ్చు అవుతున్నాయి. పుస్తకాలను వేగంగా చదవడం ఎలాగో మీరు నేర్చుకోకపోతే ఎక్కువ వెక్కువ విజ్ఞానం కోసం సాగే పోటీలో మీరు వెనుకబడి

### అతి వేగంగా కారు నడిపే వారిని గుర్తించే రాడారు

ప. జర్మనీలోని లింబుర్గ్‌లో పక్కపక్కన మూడు కార్లు పోగల ఒక విశాలమైన రోడ్డులో పోలీసులు వేగంగా కారు నడిపిన నేరానికి ఫైన్‌ల క్రింద ఏటా 13.50.000 పౌన్లు వసూలు చేయగలగడానికి కారణం—రహస్యంగా అలాంటి కార్లను గుర్తించగల రాడారు। డ్రైవర్‌లు బుకాయించడానికి వీలు లేకుండా వారి ఫొటోలను కూడా అది నమోదు చేసుంది

---

"తమ నిజ స్వరూపాలను బట్టి కాక పైకి కనిపించే రూపాలను బట్టే మనుషులకు విలువ కడుతున్నారు." —బుల్వెర్ లిట్టన్

పోవడం తథ్యం. వేగంగా చదవడం అలవాటైతే పదాలద్వారా భావాలను గ్రహించడం కాకుండా, భావాలను నేరుగా 'చదవడం' నేర్చుకుంటారు. ఒక కొత్త పద్ధతిలో తేలిగ్గా చదవడం మీకు అలవడుతుంది.

మొదటి మెట్టు:

'కన్నూ, పెదవులూ' కంటే, 'కన్నూ, చెవులూ, పెదవులూ' కంటే 'కన్నూ, మెదడూ' మరింత వేగంగా పని చెయ్యగలవు గనుక, 'కంటి పఠనం' (sight reading) అలవరచుకోండి. 'కదలిక పాఠకుడు' (motor reader) తనలో తను చదువుకుంటున్నా పెదవులు కదుపుతూ ఉంటాడు. 'వినికిడి పాఠకుడు' (auditory reader) ధ్వని రూపంగా మార్చుకుని మనస్సు చెవితో వింటేగాని మాటలను అర్థం చేసుకోలేడు. ఈ కదలిక పాఠకుడూ, వినికిడి పాఠకుడూ చదివే మాటలద్వారా తప్ప భావాలను గ్రహించలేరు. "మాట మాటా చదవడం అంగుళం అంగుళం నడవడం లాంటిది!"

రెండో మెట్టు:

గుర్తుంచుకోండి — రచయిత తన భావాలను ప్రకటించడం కోసం మాటలు వాడుతాడు. అందుచేత ఉత్తమ పాఠకుడు భావాల కోసం చదువుతాడు: పదబంధాలనూ (phrases), భావాలనూ చదవడం అలవరచుకుంటాడు. ఇందుకు కంటికి శిక్షణ ఇవ్వడం అవసరం. ఒక్క చూపుతో ఎక్కువెక్కువ మాటలు గ్రహించేట్టూ వెనుక దృష్టిమాని చూపు లయాత్మకంగా పేజీమీద ముందుకే కదిలేట్టూ కంటికి శిక్షణ ఇవ్వాలి. మన కళ్లు ఒక కెమేరా లాగ పనిచెయ్యాలి. కెమేరా ఒక మొత్తం 'దృశ్యాన్ని' (information) గుర్తించి, దాని వివరా లన్నీ ప్రదర్శిస్తుంది. మన కంటి కెమేరా వేగం పెరిగేట్టు చూసుకోవాలి 'దృష్టి పరిధి' (eye-span) ని

## ఇండియాలో సినిమా థియేటర్ల కొరత



ప్రపంచంలో అత్యధిక సంఖ్యలో 'కథా చిత్రాలను' (feature films) నిర్మిస్తున్న ఇండియాలో మన జనాభాకు తగినన్ని సినిమా థియేటర్లు లేవు. ప్రతి వెయ్యి మందికీ శ్రీలంకలో 13 సీట్లూ, సింగపూర్‌లో 27 సీట్లూ, కెనడాలో 29 సీట్లూ, బ్రిటన్‌లో 15 సీట్లూ, ప. జర్మనీలో 18 సీట్లూ ఉంటే, ఇండియాలో కేవలం 7 సీట్లు మాత్రమే ఉన్నాయి. ఇండియా జనాభాలో 3 వ వంతు కంటె తక్కువ జనాభా ఉన్న రష్యాలో ఆశ్చర్యకరంగా 1,50,000 సినీ థియేటర్లు ఉన్నాయి!

---

"మనలో ఉత్సాహం కొరవడినప్పుడే
పరుల పట్ల మనం ఉదాసీనులుగా ఉంటాం!" —హాజ్‌లిట్

పెంచడానికి ఈ క్రింది అభ్యాసం తోడ్పడు తుంది.

o....o....o....o....o
o....o....o... o....o
o....o....o....o....o
o... o....o....o....o

చుక్కలు అక్షరాలనీ, 'o' చూపు ఆనే స్థలం అనీ అనుకోండి. పైన చూపినట్లు పంక్తిలో 5 స్థలాలలోనే చూపును ఆనుస్తూ చదవడం అభ్యాసం చెయ్యండి. లయాత్మకంగా మీ చూపు కదులుతూ ఉండాలి. రోజూ ఇలా అయిదేసి స్థలాలలో చూపు నిలుపుతూ ఒక పేజి మేటరు చదవడం అభ్యాసం చెయ్యండి.

మూడో మెట్టు:

కడకంటి చూపు బలపడేట్టు చేసేందుకు ఈ క్రింది అభ్యాసం తోడ్పడుతుంది. ఒక పోస్టుకార్డు తీసుకుని ఈ క్రింది చిత్రంలోలాగ పై భాగాన మధ్యలో ఒక బాణం గుర్తు పెట్టుకోండి.



ఆ కార్డును పేజీమీద ఉంచి, బాణపు కొన మీదనే చూపు నిలిపి, క్రమంగా కార్డును ఒక్కొక్క పంక్తి మీదుగా క్రిందికి జరపండి. మీ చూపు ఏమాత్రం చలించకూడదు ఆత్మ వంచన చేసుకోకుండా జాగ్రత్తగ రోజూ 5 నిముషాలపాటు ఈ అభ్యాసం చెయ్యండి. పంక్తిలోని అన్ని మాటలవైపు పూర్తిగా చూడకుండానే ఆ మాటలను గ్రహించగలరేమో చూడండి. రోజూ 5 నిముషాలు ప్రాక్టీసు చేస్తే అలాంటి శక్తి మీకు అలవడుతుంది. దీనివల్ల రెండు లాభాలు: కంటి కండరాలకు శ్రమ తగ్గుతుంది; మెదడుకి ఎక్కువ మేత లభిస్తుంది.

## 'ఎఫ్-16' విమానం విశిష్టత




ఇటీవల బహుళ ప్రచారం పొందిన అమెరికా దేశపు 'ఎఫ్-16' విమానం 40 సెకనుల కాలంలోనే ధ్వని వేగాన్ని అతిశయించ గలదు. 90 సెకనులలో 12,000 మీటర్ల ఎత్తుకు చేరుకోగలదు. సెకనుకు అది 100 గుళ్ళను పేల్చ గలదు. రష్యా వారి 'ఎం.ఐ.జి (MIG) 25 ఫాక్స్‌బాట్' విమానం ఒక్కటే దీనికి సాటి వచ్చేది. అది 24 000 మీటర్ల ఎత్తున గంటకు 3,000 కి మీ.ల వేగంతో పయనించ గలదు.

"మన అలవాట్లు మన వశంలో ఉన్నా యని గొప్పలు చెబుతాం:
వాటిని తెంచవలసి వచ్చినప్పుడు గాని వాటి బలం తెలిసి రాదు "—శామ్యూల్ జాన్సన్

నాలుగో మెట్టు:

కంటికీ, మనస్సుకీ ఏకకాలంలోనే శిక్షణ ఇవ్వాలి అందుకు ఏదైనా ఒక పథకం ఆలోచించండి. చాలామంది తెలివితేటలు ఉన్నా - సరియైన ప్లానింగ్ లేకపోవడంవల్లనే కృతకృత్యులు కాలేరు. గ్రంథ పఠనంలో విజయం 3 అంశాలమీద ఆధారపడి ఉంటుంది: 1. 'స్థూల దర్శనం' (survey), 2. 'దాట వేయడం' (Skip/skim), 3. 'వివేచన' (scanning). 'స్థూలదర్శనం' లేకుండా దాటవేయడం జూదం క్రిందికి వస్తుంది. 'స్థూలదర్శనం' ఏ భాగాలను దాటి వేయవచ్చునో. వేటిని వివేచన చెయ్యాలో చెబుతుంది. 'స్థూలదర్శనం', 'దాటవేయడం' ఏ అంశాలను వివేచన చెయ్యాలో చెప్పిన తరువాత, 'వివేచన' ఆరంభ మవుతుంది. 'స్థూలదర్శనం' అంటే విహంగావలోకనం చెయ్యడం; వివరాల జోలికి పోకుండా స్థూలంగా దర్శించడం. పుస్తకం అయితే వెనుక పేజీమీద ఇచ్చే వివరణ (blurb), తొలిపలుకు, విషయసూచిక, పేరగ్రాఫ్ హెడ్డింగులు మొదలైనవి దర్శనం' క్రిందికి వస్తుంది. దీనివల్ల గ్రంథ కర్త చెప్పదలచుకున్నదీ, అతడు ఎవరికోసం ఆ పుస్తకం వ్రాసిందీ తెలుస్తుంది. అదే ఒక వ్యాసం గాని, ఒక అధ్యాయం గాని అయితే, మొదటి పేరా, చివరి పేరా చదవండి. సాధారణంగా దాని వల్ల రచయిత ఉద్దేశం. సంగ్రహంగా అతడు చెప్పదలచుకున్న విషయాలూ తెలుస్తాయి.

'దాటవేయడం' అంటే అర్థం అశ్రద్ధగా చదవడం అని కాదు. ఒక ప్రత్యేకమైన విషయం కోసం వెతికేటప్పుడు మనం దాటవేస్తాం. పుస్తకాలు చూసి పరీక్షలు వ్రాసే సందర్భంలో ఈ శక్తి విశేషంగా తోడ్పడుతుంది.

శీర్షికలూ, ఉపశీర్షికలూ చదవండి పేరగ్రాఫ్‌ల సైజు గమనించండి. సాధారణంగా పెద్ద పేరగ్రాఫ్‌లైతే ప్రధాన భావాలనుగూర్చి, చిన్నవైతే అప్రధాన భావాలను గూర్చి చర్చిస్తాయి. ఏవైనా కొన్ని పదాలూ, పదబంధాలూ ఒత్తుటైప్‌లో వేశారేమో చూడండి రచయిత మీ దృష్టిని ప్రత్యేకంగా ఆకర్షించడంకోసమే ఆ భాగాలను అలా ప్రత్యేకమైన టైప్‌లో అచ్చువేస్తాడు.

'ముఖ్యంగా', 'ఒక మాటలో చెప్పాలంటే', 'ముందుగా', 'ఇంతకూ చెప్పొచ్చేదేమిటంటే', 'ఏతావతా' ఇలాంటి పదబంధాల కోసం వెతకండి గ్రాఫ్‌లూ, పట్టికలూ, చిత్రాలూ రచయిత భావాలను సంక్షిప్తంగా

## నేపాల్‌లోని హిమాలయ పర్వత శిఖరాలు



నేపాల్‌లో 6,500 మీటర్ల ఎత్తు దాకా ఉన్న హిమాలయ పర్వత శిఖరాలు మొత్తం 273 ఉన్నాయి. అన్నిటిలోకీ ఛోమోలుంగ్మా (ఎవరెస్ట్ శిఖరం) మిక్కిలి పెద్దది.

"కాలు జారితే తీసుకోవచ్చును: నోరు జారితే తీసుకోలేము!" —ఫ్రాంక్లిన్

వివరించడం కోసం ఉద్దేశించబడ్డా యని గుర్తుంచుకోండి. అందుచేత వాటిలో రచయిత భావాలు మరింత స్ఫుటంగా ప్రకటించ బడు తాయి

ఎక్కువ పదజాలం తెలిసి, విస్తృతమైన విజ్ఞానం మీకు ఉండి ఉంటే ఇంటర్వ్యూకి వెళ్ళిన వాడు ఆ ఇంటర్వ్యూ ధోరణిని బట్టి ముందు రాబోయే ప్రశ్నలను ఊహించి అందుకు మానసికంగా సన్నద్ధుడైనట్టు 'స్థూల దర్శనం', 'దాటవేయడం' మీకు బాగా ఉప యోగిస్తాయి.

ఇక - 'వివేచన': ప్రధాన భాగాలను క్షుణ్ణంగా చదవాలి. ఏ ఒక్క భావాన్నీ జార విడువకూడదు. సైకిల్‌మీద మిట్ట ఎక్కే టప్పుడు మెల్లగానూ, దిగువకు వచ్చేటప్పుడు విసురుగానూ, ప్రమాదమైన చోట నిదానం గానూ సైకిల్ త్రొక్కినట్టుగా మీ గ్రంథ పఠనం సాగాలి. మాటల సముదాయాలను కాకుండా భావ సముదాయాలను చదవండి.

మధ్య మధ్య పుస్తకం మూసివేసి, ప్రధా నాంశాలను మీలో మీరు చెప్పుకోండి. దీని వల్ల చదివింది గుర్తుంటుంది.

ఆఖరుకి పేజీలు త్వర త్వరగా తిప్పుతూ ఒకసారి సింహావలోకన చెయ్యండి. దానివల్ల మీరు కొత్తగా గ్రహించిన జ్ఞానం విషయంలో ఆత్మ విశ్వాసం ఏర్పడుతుంది. "రెండు గంటలు ఏకబిగిని చదివాను. కాని, ఒక్క విషయం కూడా నాకు గుర్తు లేదు" అన డంలో అర్థం లేదు.

వార్తాపత్రిక చదివేటప్పుడు ప్రతి వ్యాసంలో మూడు సార్లు ఆ వార్తను చెబు తారు — 1. శీర్షికలో, 2. మొదటి పేరా (lead) లో, 3. తరువాతి పేరాలలో. అందు చేత వివరాలు కావా లనుకుంటే తప్ప లేకపోతే హెడ్డింగూ, మొదటి పేరా చదివితే చాలు!

గ్రంథంలో విషయాన్ని బట్టి మీ పఠన వేగాన్ని నిర్ణయించుకోవాలి. చదివేటప్పుడు పెదిమలు కదల్చకూడదు. ప్రగాఢమైన విష యాలు చదివే స్థలం వేరుగానూ, తేలిక వినోద రచనలు చదివే స్థలం వేరుగానూ ఉండాలి. యాంత్రికంగా కాకుండా, తెలివిగా చదవండి!

గుర్తుంచుకోండి: బాగా చదువ నేర్చిన వాడు బాగా బ్రదుక నేరుస్తాడు. వేగంగా చదివేవాడు దీర్ఘకాలం జీవిస్తాడు!

---

## ఒక ఏడాదిలో 5 సూర్య గ్రహణాలు



1935 లో 5 సూర్యగ్రహణాలూ, 2 చంద్ర గ్రహణాలూ సంభవించాయి. ఆ విధం ఒకే ఏడాదిలో 7 గ్రహణాలు సంభవించడ మళ్ళీ 1982 లో జరిగింది. ఆ ఏడు 4 సూర్య గ్రహణాలూ, 3 చంద్రగ్రహణాలూ వచ్చాయి

"అసత్యం అసత్యవాదికి ఆత్మహత్య: సమాజం శ్రేయస్సుకు వెన్నుపోటు!" — ఎమర్సన్

# నవభారత నిర్మాతలు

# లాలా లజపతి రాయ్

డా॥ డి. ఆంజనేయులు

టంగుటూరి ప్రకాశం పంతులు గారు 'ఆంధ్ర కేసరి' అయితే, లాలా లజ్‌పత్



రాయ్ 'పంజాబ్ కేసరి'. నిజానికి 'పంజాబ్ కేసరి' బిరుదాంకితులు ఇద్దరు ఉన్నారు. గత శతాబ్దిలో మహారాజా రంజిత్ సింగ్, ఈ శతాబ్దిలో లజ్‌పత్ రాయ్: సిక్కు లందరినీ ఒక త్రాటి క్రిందికి తేవడానికీ, తన సింహాస నాధిపత్యం నిలబెట్టుకోడానికీ రంజిత్ సింగ్ పోరాడితే, భారత దేశం స్వాతంత్ర్యం కోసం, భారత దేశంలో అంతర్భాగమైన పంజాబ్‌లోని సిక్కుల సంక్షేమం కోసం లజ్‌పత్ రాయ్ పోరాడాడు. ఒక విధంగా లజ్‌పత్ రాయ్ స్వాతంత్ర్య సంగ్రామంలో తన ప్రాణాలనే అర్పించిన మహా యోధుడు. అయితే కేవలం స్వాతంత్ర్య యోధుడుగానూ, రాజకీయ నాయకుడుగానూ మాత్రమే కాక, విద్యావేత్త (educator) గానూ, నిర్మాణాత్మక దృష్టి గల సంఘ సంస్కర్తగానూ కూడా ఆయన సుప్రసిద్ధులు. భారత దేశానికి ఉజ్జ్వల భవిష్యత్తు సాధించా లనే తపనతో జాతీయ పునర్నిర్మాణానికి పూనుకున్న అచ్చమైన 'నవ భారత నిర్మాత' లాలా లజ్‌పత్ రాయ్:

పంజాబ్‌లో జాగ్రోన్ సమీపం లోని 'ధుడికే' అనే గ్రామంలో 1865 జనవరి 28 వ తేదీన ఒక దిగువ మధ్య తరగతి హిందూ కుటుంబంలో లజ్‌పత్ రాయ్ జన్మిం

"ఊరికే ఇచ్చిన పుస్తకం చదువరు,
డబ్బుపెట్టి కొంటే తప్పకుండా చదువుతారు:" -శామ్యూల్ జాన్సన్

చాడు. తండ్రి మున్షీ రాధా కిషన్ బడి పంతులు. తల్లి గులాబ్ దేవి. చిన్ననాటి నుంచీ అమితమైన విజ్ఞాన తృష్ణతో ఎన్ని ప్రతిబంధకాలు ఎదురైనా లెక్క చేయకుండా తన చదువు కొనసాగించి, న్యాయ శాస్త్రంలో ఆయన పట్టభద్రు లయారు. ఆ రోజులలో సర్వ సాధారణంగా జరుగుతున్నట్టే 13 ఏళ్లు నిండీ నిండకుండానే ఆయనకు రాధా దేవితో వివాహం జరిగింది

'హిందూ సంఘాన్ని పునరుజ్జీవితం చెయ్యాలి' అనే ఆకాంక్ష నిరంతరం ఆయనలో ప్రస్ఫుటంగా కనిపించేది. మొదట బ్రాహ్మ సమాజ సభ్యులై, త్వరలోనే దానిని వదలి తన సహచరులైన లాలా హంస్ రాజ్, పండిత గురుదత్‌లతో సహా 1882 లో ఆర్య సమాజ్‌లో చేరారు. 'రీజెనరేటర్ ఆఫ్ ఆర్యావర్త' (ఆర్యావర్త పునరుజ్జీవని) అనే ఇంగ్లీష్ పత్రికనూ, 'దేశ్ ఉపకారక్' అనే ఉర్దూ పత్రికనూ ఆ సమాజం నడుపుతూ ఉండేది. ఇంగ్లీష్ పత్రికకు గురుదత్ సంపాదకులు కాగా, ఉర్దూ పత్రికకు లజ్‌పత్ రాయ్ సంపాదకత్వం వహించారు. ఆ తరువాత ఆయన తన కార్య రంగాన్ని లాహోర్‌కి మార్చి, అక్కడ ప్లీడరు ప్రాక్టీసు పెట్టారు. కరువు కాటకాలూ, వరదలూ వంటి ఉపద్రవాలు వచ్చినప్పుడు ప్రజలను ఆదుకోడం కోసం నిధులు సేకరిస్తూ ఆయన విస్తృతంగా దేశ పర్యటన చేస్తూ ఉండేవారు.

1885 లో బొంబాయిలో స్థాపించబడిన ఇండియన్ నేషనల్ కాంగ్రెస్ క్రమంగా లజ్‌పత్ రాయ్ దృష్టిని ఆకర్షించింది. 1888 నాటి అలహాబాద్ కాంగ్రెస్ సభకు ఆయన హాజరు అయారు. 1893 లో లాహోర్‌లో జరిగిన కాంగ్రెస్ మహా సభలోనే ఆయన తొలిసారిగా ఆ నాటి ప్రముఖ జాతీయ నాయకుడు బాలగంగాధర్ తిలక్‌ను కలుసుకున్నారు. జీవితాంతం తిలక్ ఆయనకు ప్రాణ మిత్రుడుగానూ, ఆరాధ్య దైవంగానూ ఉన్నారు. ఆ ఉభయులలోనూ కొన్ని సమాన ధర్మాలున్నాయి ఇద్దరూ మహా సాహసులు; ఇద్దరూ

## తిరిగి వచ్చిన దరఖాస్తు




"ఉద్యోగం కోసం నేను పెట్టిన దరఖాస్తులో ఉన్న తప్పు లన్నీ చక్కగా ఎర్ర సిరా కలంతో దిద్ది మరీ నా దరఖాస్తు నాకు తిప్పి పంపారు."

"ధనవంతునిగా మరణించడం కంటె ధనవంతునిలా జీవించడం హాయి!" —శామ్యూల్ జాన్సన్

తీవ్రవాదులు: ఇద్దరూ రాజీపడని స్వభావం గలవారు. 1905 లో ఇంగ్లండ్ వెళ్ళి అక్కడి ప్రజలకు భారత దేశంలోని దారుణ పరిస్థితు లను వివరించడం కోసం గోపాలకృష్ణ గోఖలేతో పాటు లజ్‌పత్ రాయ్‌ని కూడా కాంగ్రెస్ సంస్థ ఇంగ్లండు పంపించింది.

ఇండియా తిరిగి వచ్చిన తరువాత లజ్‌పత్ రాయ్ 'స్వదేశీ' ఉద్యమంలో తలమున్కలుగా పాల్గొని తిలక్‌కు మరింత సన్నిహితు లయారు. కాంగ్రెస్ చరిత్ర, భారత జాతి చరిత్రలలోనే కాక లజ్‌పత్ రాయ్ జీవితంలో కూడా 1907 ఒక ప్రధానమైన సంవత్సరం. ఆ ఏడాదే లజ్‌పత్ రాయ్‌ని అరెస్ట్ చేసి 'మాండలే' పంపించారు. నిర్బంధం నుంచి విడుదల కాగానే జాతీయ నాయకుడుగా ప్రజలు ఆయనకు ఘన స్వాగతం పలికారు. ఆ ఏడాదే పూనాలో జరిగిన కాంగ్రెస్ మహా సభలో కాంగ్రెస్ రెండుగా చీలిపోయింది. ఫిరోజ్ షా మెహతా, సురేంద్రనాథ్ బెనర్జీ, గోపాలకృష్ణ గోఖలేల నాయకత్వం క్రింద మితవాదులూ, తిలక్, లజ్‌పత్ రాయ్, బిపిన్ చంద్రపాల్‌ల నాయకత్వాన అతివాదులూ విడి పోయారు. శాంతియుతమైన ఆందోళన ద్వారా స్వాతంత్ర్యోద్యమం కొనసాగించాలని మిత వాదులు వాదిస్తే, 'ప్రత్యక్ష చర్య' జరుపా లనీ, ప్రజల నందరినీ కూడగట్టుకు రావా లనీ అతివాదులు వాదించారు. ఆ సందర్భంలోనే 'లాల్-బాల్-పాల్' అనే సమాసానికి 'తీవ్ర వాదులు' అనే అర్థం కాంగ్రెస్ వర్గాలలో రూఢం అయింది.

ఆటు తరువాత లజ్‌పత్‌రాయ్ విదేశాలలో ఉండి భారత స్వాతంత్ర్యం కోసం కృషి సాగించాలని నిశ్చయించుకున్నారు. 1913 లో ఇంగ్లండ్ వెళ్ళారు. అక్కడి నుంచి అమె రికా వెళ్ళారు. మూడేళ్ళపాటు ఆయన అక్కడ ఉన్నారు. 1920 లో ఇండియాకు తిరిగి రాగానే మళ్ళీ కాంగ్రెస్ కార్యకలాపాలు చేబట్టారు. అయితే-విదేశీ యాత్ర వల్ల ఆయ నలో చాలా మార్పు వచ్చింది. స్వానుభవం

(మిగతా 41 వ పేజీలో)

## ఈతలో అంగవికలుని ప్రతిభ



తారానాథ్ షెనాయ్ అనే బొంబాయికి చెందిన ఒక 'మూగ—చెవుడు—సగం గ్రుడ్డి' యువకుడు ఇటీవల ఇంగ్లీష్ ఛానల్‌కి అడ్డంగా ఈదాడు. 1985 జూన్‌లో ఇటునుంచి అటూ, అటునుంచి ఇటూ ఈదుతూ రెండుసార్లు ఛానల్‌ని దాటాలని అతడు ఆలోచిస్తున్నాడు. 3 ఏళ్ళ క్రితం అతడు ఇండియా, శ్రీలంకల మధ్య ఉన్న పాక్ జలసంధి కడ్డంగా ఈదాడు.

"స్వయంగా దర్శించేదాన్నే, నమ్మేదాన్నే భద్రపరచు కుంటుంది 'మనస్సు'!"

# కార్టూనులు గీయటం ఎలా ?

టి. వెంకటరావు

## 36

## ప్రతీకా విధానము (symbolism)







రాజకీయ కార్టూన్‌లలో ప్రతీకలను (symbols) వాడుక చేయడం చాలా అవసరం. జాతులు, సంస్థలు, పరిస్థితులు మొదలైన వాటిని సూచించడానికి సంప్రదాయంగా వస్తున్న ప్రతీకలను మనం వాడుక చెయ్యాలి. 'ఇజమ్'లకూ, మతాలకూ కూడా ప్రతీకలు వాడవచ్చు. సాధారణంగా కార్టూనిస్ట్‌లు శాంతికి చిహ్నంగా ఒక అందమైన స్త్రీనీ, భూమిని సూచించడానికి ఒక లావుపాటి తల్లి రూపాన్నీ, యుద్ధానికి చిహ్నంగా బలిష్ఠుడైన ఒక సైనికుణ్ణి గీస్తారు

కార్టూనిస్ట్‌గా మీరు కూడా ప్రపంచం అంతటా వాడుకలో ఉన్న అనేక ప్రతీకలను వాడుక చేయవలసి ఉంటుంది. అయితే - ప్రతీకలు స్థానికులకు అర్థం కానివి అం ఉండకూడదు. ఇసుక గడియారాన్ని మోసు

"మనుష్యులెంత స్వార్థపరులో, వారు చూపే మర్యాద ఎంత కృతకమో తెలియాలంటే ఓడ ప్రయాణం చెయ్యి!" - బెర్నార్డ్ షా

గోతున్న ఒక ముసలివాణ్ణి కాలానికి సంకేతంగా గ్రహించ వచ్చును. త్రాసు చేతిలో పట్టుకున్న ఒక దేవతా మూర్తి రూపంతో 'న్యాయాన్ని' సూచించ వచ్చును.



Indo-Soviet Friendship

ఈ నాడు చాలా జాతులకు ప్రత్యేక ప్రతీకలు ఉన్నాయి. అమెరికా ప్రతీ 'శ్యాం




మామ (uncle sam); అలాగే బ్రిటన్‌కు సంకేతం 'జాన్ బుల్'

జాతులను సూచించడానికి కొన్ని జంతువుల బొమ్మలను గీయడం కూడా కద్దు బ్రిటన్ జాతీయ చిహ్నం 'సింహం'. రష్యాకు 'ఎలుగు బంటు'. చైనాకు 'రెండు తలల పాము' (dragon). అమెరికాలోని రిపబ్లిక్ పార్టీ చిహ్నం 'గాడిద'! అలాగే ట్రేడ్ యూనియన్‌లకు 'గుర్రం', శాంతికి



'పావురం'. దురాక్రమణకు 'రెండు తలల పాము', వంచనకు 'నక్క', దమన విధానానికి 'రాబందు', అవినీతికి 'సర్పం' సంకేతాలు.

కొన్ని దేశాలకు గుర్తులుగా వాటి పతాకలను కూడా గ్రహించవచ్చును. పై చిత్రంలో కరచాలనం చేస్తున్న రెండు చేతులలోనూ ఒక దాని మీద రష్యన్‌ల ఎర్రజెండా, మరో

(మిగతా 30 వ పేజీలో)

"చదువుకున్న వాడికీ చదువుకోని వాడికీ మధ్య సజీవుడికీ, శవానికీ ఉన్నంత తేడా ఉంది!" —అరిస్టాటిల్

# భూ ప్రదక్షిణం

## కొత్తగా అవతరించిన 'బ్రూనై' రాజ్యం

ఆగ్నేయాసియా మధ్య భాగంలో బోర్నియో దీవిలో ఈశాన్య ప్రాంతాన ఇంతకు ముందు బ్రిటన్‌కు అనుబంధ రాజ్యం (Associate state) గా ఉంటూ వచ్చిన 'బ్రూనై' ఈ ఏడాది జనవరి ఒకటో తేదీన సార్వభౌమాధికారాలు గల సంపూర్ణ స్వతంత్ర రాజ్యంగా అవతరించింది. 5 కోట్ల డాలర్ల ఖర్చుతో కొత్తగా నిర్మించిన ఒక స్టేడియమ్‌లో ఫిబ్రవరి 23న 70 రాజ్యాల రాజులూ, అధినేతలూ తిలకిస్తూ ఉండగా అతి వైభవంగా 'బ్రూనై' తన స్వాతంత్ర్యోత్సవం జరుపుకుంది. ఇండోనేసియా, మలేషియా, ఫిలిప్పీన్స్, సింగపూర్, థాయ్‌లాండ్ లతో కూడిన 'ఆగ్నేయాసియా రాజ్య సమితి' (ASEAN) లో సభ్య రాజ్యాలుగా చేరిన ఈ







## మొదటి 'త్రి పరిమాణ' చలన చిత్రం

రష్యాలోని శాస్త్రవేత్తలు ప్రపంచంలో మొట్టమొదటి 'మూడు పరిమాణాలు' గల చలన చిత్రాన్ని (holographic film) తియ్యడంలో కృతకృత్యు లయారు. ఆ చిత్రం చూస్తూ ఉంటే మనం కథా రంగం మధ్యలో ఉన్నట్టు అనిపిస్తుంది.

"సెకిలీ 'నిజం' చెరుపు చేసినంతగా
'నిజం' ఈ లోకంలో 'మంచి' చేయడం లేదు!" —లా రొచెఫొకాల్డ్

చిన్న నూతన రాజ్యానికి రాజకీయ, ఆర్థిక భద్రతలు చేకూరగల వని ఆశించవచ్చును. అత్యంత సంపన్నమైన ఈ చిన్న రాజ్యం లోని ప్రజల నిత్య జీవితం మీద ఆగ్నేయాసియా ప్రాంతంలోని సంఘటనల ప్రభావం చాలా ఎక్కువగా ఉంటుం దనడం ఖాయం!



పూర్తి బోర్నియో ద్వీపమే కాక, 'సులూ' దీవులలోనూ, ఫిలిప్పీన్స్‌లోనూ కొన్ని భాగాలు కూడా 16 వ శతాబ్ది ప్రారంభంలో బ్రూనై సుల్తాన్‌ల అధీనంలో ఉండేవి. 16వ శతాబ్దాంతం నుంచి క్రమంగా ఆ సుల్తాన్‌ల ప్రాభవం క్షీణింపసాగింది. సముద్రపు దొంగల బారి నుంచీ, అరాజకం నుంచీ కాపాడడం కోసం 19 వ శతాబ్దంలో బ్రూనై లో వేర్వేరు భాగాలు గ్రేట్ బ్రిటన్‌కూ, సారవాక్ రాజకూ, 'బ్రిటిష్ నార్త్ బోర్నియో కంపెనీ'కీ ధారాదత్తం చేయబడ్డాయి. 19 వ శతాబ్ది మధ్యలో 'బ్రూనై' ప్రస్తుతం ఉన్న సరిహద్దులలోకి కుంచించుకు పోయింది 1888లో జరిగిన ఒక సంధి ప్రకారం గ్రేట్ బ్రిటన్ సంరక్షణకు ఈ రాజ్యం వప్పగించబడింది.

'బ్రూనై' రాజ్యానికి ఉత్తరాన 'దక్షిణ చైనా సముద్రం' తక్కిన మూడు వైపులా మలేషియా రాష్ట్రం అయిన సారవాక్ ఉన్నాయి. 'బ్రూనై' రెండు విడి భాగాలుగా ఉంది. ఒకటి పెద్దది, మరొకటి చిన్నది. 'సారవాక్' రాష్ట్ర భాగం రెండింటినీ విడదీస్తుంది, రెండు భాగాలూ కలిపిన మొత్తం దేశం వైశాల్యం 5,765 చ.కి మీ. లు. పడమట ఉన్న పెద్ద భాగం బాగా అభివృద్ధి పొందింది. బ్రూనైకి పెన్నిధులు అనదగిన నూనె బావులు (oil fields) ఇక్కడే ఉన్నాయి. 'బోర్నైన్' రాజధాని అయిన 'బందర్ సెరీ బెగావాన్' కూడా ఈ పెద్ద భాగంలోనే ఉంది. తూర్పున ఉన్న చిన్న భాగం పర్వత ప్రాంతం. అది అంతగా అభివృద్ధి చెందలేదు.

బ్రూనైలో శీతోష్ణస్థితి భూమధ్య రేఖ

## 50 ని.లలో 5 కోట్లమందిని హత మార్చే పరమాణు బాంబులు

రెండో ప్రపంచ సంగ్రామంలో మొత్తం హతుల సంఖ్య 5 కోట్లు. ఈ నాడు అగ్ర రాజ్యాలవద్ద ఉన్న పరమాణు బాంబులు 50 నిమిషాలలోనే 5 కోట్లమందిని హత మార్చ గలవు.

"దేవుడు ఇంకా గొప్ప విషయాల కోసం మనల్ని మలిచేందుకు వాడే పరికరాలు - కష్టాలు!" - హెచ్. డబ్ల్యు బీచర్

ప్రాంతంలో కనిపించేదే! ఏడాది పొడుగునా ఎండలూ, వర్షపాతం - రెండూ ఎక్కువే! ఇక్కడ పెరిగే దట్టమైన అడవుల నుంచి మేలిరకం కలప లభిస్తుంది.



బ్రూనై సుల్తాన్

'బ్రూనై' జనాభా సుమారు 2,20,000. వీరిలో సగం పై చిలుకు మలయా ముస్లిములు. తక్కువ వారిలో చైనావారు, ఇండియనులు, ఐబన్‌లు అనబడే స్థానిక ఆదివాసులు ఉన్నారు. జనాభాలో సుమారు 1/3 వ వంతు నూనె గనుల పరిశ్రమలోనే పని చేస్తున్నారు. బ్రూనై ఆర్థిక వ్యవస్థకు నూనె గనులు వెన్నెముక లాంటివి. 1929 లో కనుగొనబడిన 'సేరియా' (Seria) నూనె గనుల నుంచీ, సముద్ర తీరం చేరువను సముద్రం అడుగున త్రవ్విన కొన్ని బావుల నుంచీ నూనె ప్రధానంగా లభిస్తుంది. నూనె మాత్రమే కాక, ఈ గనుల నుంచి ఇంధన వాయువు కూడా లభ్యం అవుతుంది. ఈ దేశం ఎగుమతులలో 90 శాతం నూనె ఎగుమతులే!

రాజధాని నగరం 'బందర్ సేరీ బెగావాన్' ఈ దేశానికి ప్రధానమైన ఓడరేవు కూడా. కాని ఈ రేవు లోతు తక్కువ కావడం వల్ల సేరియన్ నూనె గనుల నుంచి నూనెను పైప్ ద్వారా సారవాక్‌లోని 'లుటాంగ్'కు పంపి అక్కడ దానిని శుద్ధి చేసి, జపాన్‌కు ఎగుమతి చేస్తున్నారు.

'బ్రూనై' దేశపు 29 వ పాలకుడైన 37 ఏళ్ళ వయస్సు గల సర్ మూడా హాస్సానల్ బోల్కియా ముయిజ్జుడీన్ వద్దౌలా అనే సుల్తాన్ రాజ్యాంగ సంవిధానం ప్రకారం ఈ దేశానికి సర్వాధికారి. రాజధాని నగరం సమీపాన గల 100 అ. ల ఎత్తున్న కొండమీద 20 కోట్ల డాలర్ల ఖర్చుతో ఇటీవలనే నిర్మించబడిన 1,788 గదులున్న సువిశాలమైన రాజప్రాసాదం ఈయన నివాసం. బ్రూనైకి ప్రధానీ, ఆర్థిక మంత్రీ, హోమ్ మంత్రీ కూడా ఈయనే!

## సుప్రసిద్ధ వయొలిన్ విద్వాంసుడు మెనూహిన్

అమెరికాలోని ఒక సామాన్య ఉపాధ్యాయుని కుమారుడు యెహూదీ మెనూహిన్ ఈ నాడు ప్రపంచంలోని వయొలిన్ విద్వాంసులందరిలోనూ అగ్రగణ్యులు. 11 ఏళ్ళ వయస్సులోనే ఆయన బీతోవెన్ 'వయొలిన్ కన్సెర్టో' వాయించగా అతని వాయిద్యంలోని నిర్దుష్టతను చూసి పక్క వాద్యగాళ్ళు నిర్ఘాంత పోయారట!

"తమ పిల్లల స్వభావం విషయంలో కంటె గుర్రాల, కుక్కల జాతి విషయంలో మనిషి ఎక్కువ శ్రద్ధ చూపిస్తాడు!" —పెన్న్

బ్రూనై జాతీయ పతాక పసుపు పన్నె వస్త్రం మీద ఏటవాలుగా రెండు తెలుపు, నలుపు చారలతో కూడి ఉంటుంది. ఈ రాజ్యంలో అధికార భాష 'మలయ్'. అయితే ఇంగ్లీషును కూడా అన్ని ప్రభుత్వ వ్యవహారాలలోనూ వాడవచ్చును. ప్రశ మతం 'ఇస్లామ్'.



సుల్తాన్ దంపతులు

దాదాపు 200 మంది ఆఫీసర్లూ, 2,750 మంది కాల్బలమూ మాత్రమే గల 'బ్రూనై' సైన్యాన్ని ఇంకా పెంపొందించి, ఆధునికీకరించే ప్రయత్నం చేస్తున్నారు. బ్రిటిష్ సైన్యం తాలూకు 750 మంది గూర్ఖాలతో కూడిన దళం ఒకటి ఇప్పటికీ 'బ్రూనై'లో ఉంది. దేశ రక్షణ బాధ్యత ఈ దళానిదే! ఈ దళం క్రింద అయే సాలీనా ఖర్చు-30 లక్షల పౌన్లు - సుల్తాన్ ఏటా బ్రిటన్‌కు చెల్లిస్తారు.

నూనె, ఇంధన వాయువుల నుంచి ఏటా ప్రభుత్వానికి వచ్చే ఆదాయం 500 కోట్ల డాలర్లు. తారుతో అందంగా తీర్చిదిద్దిన 385 మైళ్ళ రోడ్ల మీద ఈ దేశంలో 50,000 దాకా కార్లు తిరుగుతున్నాయి. చదువు, విద్యుచ్ఛక్తి, పెట్రోలు, బియ్యం, చక్కెర, వైద్య సదుపాయం, విదేశాలలో చదువుకునే వారికి స్కాలర్‌షిప్‌లూ పౌరులకు ఉచితంగా బ్రూనైలో అందజేస్తున్నారు. ఇక్కడ ఆదాయపు పన్ను లేదు. ఇళ్ళు కట్టుకునేందుకు ప్రభుత్వం మంజూరు చేసే ఋణాల మీద 1/2 శాతం వడ్డీ మాత్రమే వసూలు చేసారు.

(26 వ పేజీ తరువాయి)

దానిమీద భారతీయ త్రివర్ణ పతాక కనిపిస్తున్నాయి. ఇండో - సోవియట్ మైత్రికి ఇది సంకేతం.

పరిసరాలను సూచించడానికి - అంటే, ఇది వాషింగ్టన్, ఇది మాస్కో, ఇది పారిస్, ఇది న్యూఢిల్లీ అని సూచించాలంటే-కార్టూనిస్టులు ఆ యా నగరాలలోని సుప్రసిద్ధ భవనాలను బాక్ గ్రౌండ్‌లో చిత్రిస్తారు. ఉదాహరణకు - వాషింగ్టన్‌ని వైట్ హౌస్‌తోనూ, మాస్కోను క్రెమ్లిన్‌తోనూ, కెయిరోను ఒక పిరమిడ్‌తోనూ, న్యూయార్క్‌ను 'లిబర్టీ' ప్రతిమతోనూ, చైనాను గ్రేట్ వాల్ (మహా కుడ్యం) తోనూ సూచిస్తారు.

ఇండియాలో అయితే హైదరాబాద్‌కి చార్‌మినార్‌నూ, ఢిల్లీకి కుతుబ్ మినార్‌నూ, బొంబాయికి 'గేట్ వే ఆఫ్ ఇండియా'నూ, కలకత్తాకు హౌరా బ్రిడ్జినీ సంకేతాలుగా కార్టూనిస్టులు గ్రహిస్తారు. (సశేషం)

"విద్య ఐశ్వర్యంలో ఆభరణం; ఆపదలలో అండ!" -అరిస్టాటిల్

# ఉర్లగడ్డలో ఉన్న విశేషం

ఇవాళ మనం చాలా ఇష్టంగా ఉపయోగించే ఉర్లగడ్డ (బంగాళాదుంప) పుట్టు పూర్వోత్తరాలు మనలో చాలామందికి తెలియవు. 'నూతన జగత్తు' (New World) అనబడే



ఉత్తర, దక్షిణ అమెరికాల నుంచి తెచ్చి, శ్పానిష్ విజేతలు మొదట 16వ శతాబ్దం మధ్యభాగంలో ఈ ఉర్లగడ్డను యూరప్ ఖండానికి పరిచయం చేశారు. ఇంగ్లండుకి ఉర్లగడ్డను మొదట తెచ్చినవాడు ఫ్రాన్సిస్ డ్రేక్ అనే సుప్రసిద్ధమైన సముద్రపు దొంగ.

ఉర్లగడ్డ యూరప్‌లో మొదట స్పెయిన్‌కూ, ఆ తరువాత క్రమంగా ఇటలీ, ఫ్రాన్స్ లకూ కొనిరాబడింది. యూరప్‌లోని వివిధ దేశాలలో ఉర్లగడ్డ వ్యాప్తి ఆ యా దేశాల విచిత్రమైన జాతీయ లక్షణాలను ఆవిష్కరిస్తుంది. ఫ్రాన్స్‌రాజు 16వ లూయీ తన దేశంలో ఉర్లగడ్డ మొక్కలకు పూసిన తొలి పువ్వుల గుత్తిని తన చొక్కామీద అందంగా ధరించాడు. వెంటనే ఆ దేశంలో అదొక ఫాషన్‌గా ఏర్పడి, సామంత ప్రభువు లందరు ఉర్లగడ్డ మొక్కల ఊదా (violet) పూవు కోసం ఎగబడసాగారు. దానితో పరాయి దేశం నుంచి దిగుమతి అయిన ఆ వింత మొక్కను విరివిగా పెంచడానికి రైతులకు ప్రోత్సాహం లభించింది. ప్రష్యా రాజు మొదటి ఫ్రెడరిక్ తన విలక్షణమైన ధోరణిలో ఉర్లగడ్డల సాగును తన దేశంలో ప్రోత్సహించాడు ఉర్లగడ్డలు సాగు చేయ నిరాకరించే వారి ముక్కూ, చెవులూ కోసి వేయిస్తా నని ఆయన తన రాజ్యంలో చాటించాడు.

రష్యాలోకి ఉర్లగడ్డలను ప్రవేశపెట్టిన జార్ చక్రవర్తి పీటర్ ది గ్రేట్. 1700 లో హాలండ్ దేశంలో పర్యటిస్తూ ఒక బస్తాడు ఉర్లగడ్డలు తన దేశానికి పంపి వాటిని అక్కడ

---

## కారు ప్రమాదాల్లో మరణాలు

అమెరికాలో జరిపిన ఒక పరిశోధన ఫలితంగా ఏటా కారు ప్రమాదాలవల్ల మరణం సంభవించే అవకాశం 1/3600 అనీ, నీటి వల్ల మరణం సంభవించే అవకాశం 1/27,000 అనీ, పిడుగుపడి చనిపోయే అవకాశం 1/10,00,000 అనీ, పరమాణు కేంద్రాలలో జరిగే ప్రమాదాల వల్ల మరణించే అవకాశం 1/1000 కోట్లు అనీ ప్రకటించారు.

---

"మీ వాదమే సరైన దని మీకు తెలిసినా ఆవేశంతో వివాదానికి దిగకండి!" —లార్డ్ చెస్టర్‌ఫీల్డ్

...గు చేయవలసిందని ఆ జార్ చక్రవర్తి ...దేశించాడు.

తొలి రోజులలో ఉర్లగడ్డలను అభిమానించి పెంపొందించిన వారంతా చిత్రంగా ఉన్నత వర్గాలవారూ, శాస్త్రవేత్తలూ మాత్రమే! జన సామాన్యం ఆ క్రొత్త ఆహారం పట్ల వైముఖ్యాన్ని ప్రదర్శించింది.



Potato

తత్ఫలితంగా కొన్నిచోట్ల 'ఉర్లగడ్డ తిరుగుబాట్లు' కూడా సంభవించాయి. అయినా కాల క్రమేణ ఈ 'భూగర్భంలోని ఆపిల్ కాయ'ల వాస్తవమైన 'ఆహారపు విలువ' గుర్తించబడింది. 19 వ శతాబ్ది మధ్యభాగానికి రష్యాలో దేశవ్యాప్తంగా ఉర్లగడ్డ పండించబడుతూ, రొట్టె తరువాత చెప్పుకోదగ్గ ప్రధానమైన ఆహారంగా వారికి అది రూపొందింది.

ఈ రోజున ప్రపంచంలో ఏటా 30 కోట్ల టన్నుల ఉర్లగడ్డలు పండిస్తున్నారు. ఉత్తరాన ఆర్కిటిక్ వలయం మొదలు దక్షిణాన 'మాజెలాన్' జలసంధి (ద. అమెరికా దక్షిణాగ్రం సమీపంలో ఉంది) దాకా మొత్తం 130 దేశాలలో ఉర్లగడ్డను పండిస్తున్నారు. ఎప్పుడూ ఎండలు మండిపోతూ ఉండే ఆఫ్రికా ఎడారులలో కూడా ఉర్లగడ్డలు సాగు చేస్తున్నారు. ప్రపంచం మొత్తంమీద పండే పంటలో మూడోవంతు సోవియెట్ యూనియన్‌లోనే పండించబడుతూంది. పోలండ్, అమెరికా ద్వితీయ, తృతీయ స్థానాలలో ఉన్నాయి. వాడకందార్లు చెల్లిస్తున్న ధరల రూపంలో చెప్పాలంటే ప్రపంచంలో ఈనాడు 10,600 కోట్ల డాలర్ల విలువచేసే ఉర్లగడ్డలను పండిస్తున్నారు. ద. అమెరికాలోని ఎర్ర ఇండియన్‌ల నుంచి యూరోపియన్ విజేతలు దోచుకున్న ఐశ్వర్యం అంతటికంటె ఎక్కువ విలువ గల మొత్తం ఇది. కొన్ని దేశాలలో హెక్టేర్‌కు 100 టన్నుల దిగుబడి కూడా సాధిస్తున్నా, సాధారణంగా 30 మొదలు 50 టన్నుల పంట పండితే అది మంచి పంట కిందే లెక్క!

'నూతన జగత్తు'ను కనుగొన్న 4½ శతాబ్దాల అనంతరం ఇప్పటికీ యూరపియన్‌లకు ఉర్లగడ్డలలో ఒక్క రకమే తెలుసు. అయితే

## ప్రభూ! నాకు విముక్తి కలిగించు!

భవిష్యత్తును గూర్చిన 'భయం' నుంచి
'రేపు'ను గూర్చిన 'ఆదుర్దా' నుంచి
పరుల పట్ల 'ఆగ్రహం' నుంచి
ప్రమాదానికి జంకే 'పిరికితనం' నుంచి
అవకాశాన్ని చెయి విడిచే 'ఓటమి' నుంచి
విధి నిర్వహణలో 'సోమరితనం' నుంచి
ప్రభూ! నాకు విముక్తి కలిగించు!

"ఎక్కువ ఆదాయం గల వారు మాత్రమే అనుభవించగల భోగం – 'కోపం'!" —జార్జ్ విలియమ్ కర్టిస్

చేదు గడ్డలతో కూడిన పశువుల గ్రాసంగా ఉపయోగించే ఒక రకాన్ని కూడా రష్యా వారు పెంచుతున్నారు. యెఫిమ్ గ్రేచెవ్ అనే రష్యాదేశపు 'మొక్కల పెంపకం' నిపుణుడు స్థానికావసరాల దృష్ట్యా కొత్త కొత్త వంగడాలను సృష్టించడానికి పూనుకున్నాడు ఎరుపు, పసుపు, పెంకురంగు, ఊదా మొదలైన అన్ని రంగుల ఉర్లగడ్డలనూ, పొడుగ్గానూ, గుండ్రంగానూ, శంకువు ఆకారంలోనూ, నున్నగానూ, లోతు గుంటలతోనూ కూడిన అన్ని ఆకారాల ఉర్లగడ్డలనూ ఆయన పండించాడు. 1881 లో ఏర్పాటు చేసిన ఒక ఎగ్జిబిషన్‌లో 93 రష్యన్ రకాల ఉర్లగడ్డలు ప్రదర్శించబడ్డాయి. 1922 లో అలెగ్జాండర్ లోర్క్ సృష్టించిన మేలికరం ఉర్లగడ్డ చాలాకాలం ఉర్లగడ్డలలో రాజా రకంగా చలామణీ అయింది.

ఏమైనా - క్రొత్త 'జీన్'ల చేరిక లేకపోతే ఏ రకం పంట అయినా క్రమంగా క్షీణిస్తుంది. సుప్రసిద్ధ సోవియెట్ శాస్త్రవేత్త నికొలాయ్ వావిలోవ్ ప్రతిపాదించిన సాగు పంటలలో 'ప్రభవ కేంద్ర సిద్ధాంతం' (Theory of centres of origin) లాటిన్ అమెరికాలో అడవి పంటలుగా పెరిగే ఉర్లగడ్డ రకాలలో 'జీన్'ల నిధులు ఉన్నట్టు సూచిస్తుంది. ఒక సోవియెట్ శాస్త్రవేత్తల బృందం మెక్సికో, పెరూ, గ్వాటిమేలా, బొలీవియా, ఛిలీలలో పర్యటించారు. అనంతరం వావిలోవ్ స్వయంగా 'సెంట్రల్ ఆండీజ్' సందర్శించాడు. ఉర్లగడ్డలలో అడవి పంటగా పెరిగే 60 రకాలూ, సాగు రకాలలో ఇంతకు ముందు బయటి ప్రపంచానికి తెలియని 20 కొత్త రకాలూ గుర్తించబడ్డాయి. సోవియెట్ శాస్త్రవేత్తల బృందం తరువాత అమెరికా, జర్మనీ, స్వీడన్, నార్వే, బ్రిటన్‌ల నుంచీ, ఉరుగ్వే, పెరూ, ఛిలీల నుంచీ కూడా శాస్త్రవేత్తల బృందాలు ఉర్లగడ్డలలో కొత్త రకాల అన్వేషణకు పూనుకొన్నాయి. సుమారు 60 ఏళ్ళ నుంచీ ప్రపంచంలోని ఉర్లగడ్డ మొక్కల పెంపకం దారులు లాటిన్ అమెరికాలోని అడవి మొక్కలుగా పెరిగే రకాలను గూర్చి పరిశోధనలు చేస్తున్నారు.

## మిక్కిలి పెద్ద బల్లి



ప్రపంచంలో మిక్కిలి పెద్ద బల్లి 'కోమోదో డ్రాగన్'. 'కొమోడో'లోనూ, ఇండోనీషియాకు చెందిన పలు చిన్న దీవులలోనూ ఇది కనిపిస్తుంది. సాధారణంగా ఇది 10 అ.ల పొడవూ, 365 పౌన్ల బరువూ ఉంటుంది. అయినా మనిషితో సమానమైన వేగంతో అది పరుగెత్త గలదు.

"ప్రతిభావంతుల ప్రతి మాటలోనూ మనం చెప్పలేక త్రోసిపుచ్చిన భావాలే తిరిగి హుందాగా మనకు సాక్షాత్కరిస్తాయి." —ఎమర్సన్

ఉర్లగడ్డలో చెప్పుకోదగిన లక్షణాలు మూడు ఉన్నాయి:

మొదటిది: అధిక దిగుబడి. రష్యాలోని యుక్రేన్ రాష్ట్రంలో జిటోమిర్ ప్రాంతంలో కొన్ని సంవత్సరాలలో ఉర్లగడ్డ పంట హెక్టేర్ కి 128 టన్నుల స్థాయిని కూడా అందుకుంది.

రెండోది: పోషకాహారంగా ప్రత్యేకమైన విలువ కలిగి ఉండడం. ఉర్లగడ్డలో పిండి పదార్థం, మాంసకృత్తులూ ఉన్నాయని అందరికీ తెలుసు. కాని, ఉర్లగడ్డ ఎక్కువగా వాడే వారికి 60 శాతం విటమిన్ 'సి' అవసరాలను కూడా ఇది తీర్చగలదు అంతేకాక-భాస్వరం, ఇనుము, పొటాషియమ్, సోడియమ్, అయొడిన్, విటమిన్ 'బి'లను కూడా ఇది సరఫరా చేస్తుంది.

మాంసాహారం పెరుగుదలకు కూడా ఉర్లగడ్డ దోహదం చేస్తుంది. ప్రపంచంలోని ఉర్లగడ్డ పంటలో దాదాపు 50 శాతం పశువుల మేతగా ఉపయోగపడుతూంది. ఉర్లగడ్డ వల్ల సారాయి, పిండి, రంగులు, మోటారు కారుల ఇంధనం లాంటి ఉపయోగకరమైన ఇతర పదార్థాలు కూడా లభిస్తున్నాయి.

మూడోది: బలిష్టమైె. పెంచడంలో ఎలాంటి శ్రమా లేక పోవడం. ఏ నేలలో అయినా, ఎలాంటి శీతోష్ణస్థితులలో అయినా ఉర్లగడ్డను సాగు చేయవచ్చును. గోధుమ, జొన్న, వరి లాంటి ఇతర మొక్కల కంటె త్వరగా పంట చేతికి వస్తుంది. చిత్తడి నేలతో కూడిన అడవులలో (humid forests) మాత్రమే ఉర్లగడ్డ మొక్కలు వాడి, మాడి పోతాయి.

అయితే - ఉర్లగడ్డ సాగులో కొన్ని చిక్కులూ లేకపోలేదు. పండిన పంటలో చాలా ఎక్కువ భాగం విత్తనంగా మళ్ళీ చేలో నాటవలసి ఉంటుంది. హెక్టేర్ కి 3 టన్నుల ఉర్లగడ్డలు విత్తనంగా నాటాలి.

ప్రస్తుతం ప్రపంచ జనాభా 460 కోట్లు. ఐక్యరాజ్య సమితి లెక్కల ప్రకారం 2,110 నాటికి ఈ జనాభా 1050 కోట్లు అవుతుంది. అన్ని నోళ్ళను నింపడం అప్పుడు పెద్ద సమస్య అవుతుంది. ఆ సమస్యను పరిష్కరించడంలో నిస్సందేహంగా ఉర్లగడ్డ తోడ్పడగలదు.

('స్పుట్నిక్' లోని వ్యాసానికి సంక్షిప్తానువాదం)

## చరిత్ర పూర్వయుగం నాటి ఏనుగుల దంతాలు



క్రీ.శ. 1900 వ సం.రం దాకా ప్రపంచంలో వాడుక చేయబడిన దంతాలన్నీ చరిత్ర పూర్వయుగం నాటి ఏనుగుల (mammoths) శిలాస్థుల నుంచి లభించినవే! వీటిని సైబీరియా (రష్యా) లోని ఈశాన్య ప్రాంతం నుంచి త్రవ్వి తీశారు.

"అమర్యాదగా జీవించడం కంటె గౌరవంగా చనిపోవడం మేలు!" —టాసిటస్

## బహుమతి పొందిన వ్యాసం

# సహజీవనం

పి. రామ సుబ్బారావు,
హైదరాబాద్.

'సహజీవనం' అంటే ఒక జీవి ఇంకొక జీవితో కలసి సామరస్య భావంతో జీవించడం. దీని ధ్యేయం విశ్వకల్యాణం, విశ్వశాంతి. అందరూ అన్యోన్యంగా కలసి బ్రదకడానికి ముఖ్యంగా కావలసింది - సహనం, ఓర్పు! ఈ ఓర్పులోనే స్వార్థత్యాగం కూడా ఇమిడి ఉంది. ఒకే జాతి జంతువులలో కనిపించే ఐకమత్యం కూడా మానవ జాతిలో లోపించడం దురదృష్టకరం. భారత రాజ్యాంగానికి కుల, మత, వర్గ రహిత సమ సమాజ నిర్మాణమే ధ్యేయంగా పొందుపరచ బడింది. కాని, ఇది జరిగి 4 దశాబ్దాలు పూర్తి కావస్తున్నా పేదరికం నిర్మూలన కాకపోవడం అలా ఉండగా, ధనార్జన కాంక్ష మిన్ను ముట్టుతూ ఉంది. కలవారు లేని వారిని ఏదో రకంగా దోపిడీ చేస్తూనే ఉన్నారు.

'మతం' అనేది ఏ పేరుతో ఎవరు స్థాపించినా దాని గమ్యం విశ్వశాంతే! అయినా మతం పేరుతో విద్వేషాలు చెలరేగి అనంఖ్యాక జనానీకం ప్రాణాలు కోల్పోతూ ఉండడం దురదృష్టకరం. ఒకే కుటుంబంలో

### 'బట్టమేర' పక్షుల సంరక్షణా కేంద్రం



మధ్య ప్రదేశ్‌లోని శివపురి జిల్లాలో 'బట్ట మేర' పక్షుల (ఒక రకం అడవి కోడి. (bustard) సంరక్షణ కోసం 203 చ. కి. మీ.ల వైశాల్యం గల ఒక కేంద్రాన్ని నెల కొల్పారు. ఈ పక్షి జాతి అంతరించిపోయే ప్రమాదం ఏర్పడడం వల్ల ఈ కేంద్రం నెల కొల్పడం అవసరం అయింది. ఏటా ఒక్క గుడ్డును మాత్రమే పెట్టే ఈ పక్షికి యుక్త వయస్సు రావడానికి 4, 5 ఏళ్ళు పడుతుంది.

---

"ఇతరులకు బాధ కలిగించే బదులు మనం బాధపడడం మంచిది." —శామ్యూల్ జాన్సన్

కూడా సోదర భావం. దాంప త్యానుబంధం సడలిపోతూ, అసూయా ద్వేషాలు పెచ్చు పెరిగి పోతున్నాయి. ఒక ప్రక్క శాస్త్ర విజ్ఞానం పెరుగుతూ మానవుడు నక్షత్ర మండలం వైపు సాగుతున్న ఈ రోజులలో కూడా ఆర్థిక, సాంఘిక రంగాలలో సామ్యం సాధించలేక పోవడం నిజంగా శోచనీయమైన విషయం!

ఐక్యరాజ్య సమితి వంటి అంతర్జాతీయ సంస్థలు కూడా వివిధ దేశాధినేతల స్వార్థ దృష్టి వల్ల నిర్వీర్యమై, ప్రపంచంలో ఏదో ఒక మూల నిత్యం మారణ హోమం జరుగుతూనే ఉంది. ఈ స్థితిలో మేధావి వర్గం, సంస్కర్తలూ ఏకమై విశ్వశాంతి సాధనకు తగిన చర్యలు తీసుకుంటే తప్ప మానవ 'సహ జీవనం' పగటి కలగా మాత్రమే మిగిలిపోక తప్పదు.

* * *

బత్తుల గోవిందరావు,
మఠం సరియాపల్లి.

ఆది నుంచీ మానవుడు సంఘ జీవే! ఒకరి మీద ఆధార పడకుండా, ఇతరుల ప్రమేయం లేకుండా తన జీవన రథాన్ని ముందుకు సాగించ లేడు. మానసిక అవగాహనతో, సంఘీ భావంతో, 'తన, పర' అనే భేదం లేకుండా సద్భావంతో కలసి మెలసి జీవించడాన్ని 'సహ జీవనం' అంటారు. వ్యక్తిగతం గానూ, దేశపరం గానూ కనిపించే ఈ 'సహజీవన' శక్తి వల్లనే ఒక దేశం నాగరకత, సంస్కృతి నిర్ణయించబడతాయి. అన్యోన్యం అవగాహన లేక

## 'నేటి' మన కృషికి ఫలితమే 'రేపటి' ఇండియా దేశం



"ఈ నాటి మన కృషి వల్ల మనం కల్పించేదే రేపటి మన ఇండియా స్వరూపం! పారిశ్రామికంగానూ, ఇతర విధాలుగానూ ఇండియా అభివృద్ధి చెందుతుం దనడంలో, మన ప్రజల జీవన ప్రమాణాలు మెరుగుపడతా యనడంలో, విద్య, ఆరోగ్య పరిస్థితులు పెంపొంది, మన సంస్కృతి లలిత కళలు ప్రజల జీవితాలను ఉదాత్తం చేస్తా యనడంలో నా కెలాంటి సందేహం లేదు. దృఢ సంకల్పంతో, మంచి మనస్సుతో మనం ఈ తీర్థ యాత్రకు పూనుకున్నాం. ఎంత సుదీర్ఘం అయినా ఈ యాత్ర మనం పూర్తి చేసి, మన గమ్యాన్ని చేరి తీరుతాం!"

—జవహర్లాల్ నెహ్రూ

"సంఘ విద్రోహి చిట్టచివరకు ధరించే ముసుగు ప్రజా సేవ!" —శామ్యూల్ జాన్సన్

పోవడం వల్ల, సహనం లోపించడం వల్ల వైషమ్యాలూ, వైపరీత్యాలూ, అసూయా ద్వేషాలూ పెరిగి పోతూ, మానవ జాతికి శాంతి లేకుండా చేస్తున్నాయి. 'సహ జీవన' విధానాన్ని పెంపొందించాలంటే వివిధ దేశాలూ, మత సంఘాలూ కలసి కట్టుగా ఇందుకు పూనుకోవాలి.

* * *

కె. బాలాజీ, కమ్మవారి పాలెం.

'కలసి ఉంటే కలదు సుఖం' అన్న సత్యాన్ని మానవుడు అనాది కాలంలోనే గుర్తించాడు. ఈ ఆధునిక కాలంలో 'వసుధైక కుటుంబం' కోసం మానవుడు కలలు కంటూ ఉండడంలో అసహజత ఏమీ లేదు. కుల, మత, ధనిక, నిర్ధన, స్త్రీ, పురుషాది విచక్షణ లేకుండా అందరూ సమరస భావంతో జీవించేందుకు ప్రయత్నించాలి.

"ఒక జాతిని ఇంకొక జాతి....బలవంతుల పన్నాగాలూ ఇంకానా ఇకపై సాగవు" అని మహాకవి శ్రీశ్రీ చెప్పినట్లు శతాబ్దాల తరబడి సాగిన దోపిడీ విధానం ఇక ముందు సాగదు. మానవులు 'సహ జీవనం' అలవరచు కుంటే తప్ప లేకపోతే మానవ జాతి మనుగడకే ముప్పు ఏర్పడవచ్చు.

'సహ జీవనం' అనేది కుటుంబ స్థాయిలో ఆరంభమై సమాజ స్థాయికీ, జాతీయ స్థాయికీ, అంతర్జాతీయ స్థాయికీ విస్తరించాలి. సమాజంలో వివిధ వర్గాల మధ్య లేచిన అడ్డు గోడలను నిర్మూలించాలి. జాతి విచక్షణలూ, వర్గ భేదాలూ అంతరించాలి. కుటుంబంలో కూడా స్త్రీని పురుషుడు జీవిత భాగస్వామినిగా గౌరవించాలి.

## కొత్త 'శాటిలైట్ రేడియో తెప్ప'



'జర్మన్ ఏరో స్పేస్ రీసెర్చ్ అండ్ ఎక్స్‌పెరిమెంటల్ ఎస్టాబ్లిష్‌మెంట్' అనే సంస్థ ఒక కొత్త 'శాటిలైట్ రేడియో తెప్ప' (Radio buoy) ను తయారు చేసింది. సముద్రం మీద నౌకలకు ప్రమాదం సంభవించినప్పుడు ఈ తెప్ప నీటిమీద తేలుతూ ఆ వార్తను శాటిలైట్ ద్వారా అతి త్వరగా రక్షణ కేంద్రాలకు అందజేయగలదు. ఓడ పేరు, దాని ఉనికి వివరాలూ, ప్రమాదం సంభవించిన సమయం, ప్రమాదం స్వభావం - అన్నింటినీ అది శాటిలైట్ ద్వారా నౌకా రక్షణ కేంద్రాలకు అతివేగంగా ప్రసారం చేస్తుంది.

---

"పైకి నవ్వుతూనే కనిపించవచ్చు:
అయినా అతడు విలన్ (దుష్టుడు) కావచ్చు." —షేక్స్‌పియర్

# నైల్‌నది ప్రభవస్థానం కనిపెట్టిన హానింగ్

ఆఫ్రికాలోని నైల్‌నది పుట్టిన చోటును చేరుకున్న మొట్టమొదటి వ్యక్తి భారత సైన్యంలో అప్పుడు పనిచేస్తున్న ఒక బ్రిటిష్



ఆఫీసర్ జాన్ హానింగ్ స్పేక్ ఇద్దరు జర్మన్ మిషనరీలు అందజేసిన భోగట్టా ఆధారంగా ఆయన తన తోటి ఆఫీసర్ రిచర్డ్ బర్టన్‌తో సహా జాంజిబార్ దీవికి ఎదురుగా ఉన్న తూర్పు ఆఫ్రికా తీరం నుంచి ఖండం లోపలి భాగానికి ప్రయాణం కట్టాడు. వాళ్ళిద్దరూ కలిసే 1858 లో టాంగన్యాకా సరస్సును కనుగొన్నారు. అదే నైల్‌నది ప్రభవస్థానం అని మొదట వారు భ్రమించారు.

వారి తిరుగు ప్రయాణంలో స్పేక్ అరబ్ ...ర్తకుల రిపోర్ట్‌లు ఆధారంగా నేటి టాంజే...యాలోని తబోరా నుంచి ఉత్తరంగా అతి...ఘ్రంగా పయనించాడు. ఆ ప్రయాణం ...వర ఆయన కంట బడిన ఒక పెద్ద సరస్సును చూసి, అదే నైల్‌నది నిజమైన ప్రభవస్థానం అని భావించి, బ్రిటిష్ రాణి విక్టోరియా పేరు మీదుగా 'లేక్ విక్టోరియా' (విక్టోరియా సరస్సు) అని దానికి పేరుపెట్టాడు. అయితే ఆ తరువాత బ్రిటన్‌లోని రాయల్ జియోగ్రాఫికల్ సొసైటీ వారి ప్రేరణతో జేమ్స్ ఆగస్టస్ గ్రాంట్ అనే మరొక 'నూతన ఖండాన్వేషకుణ్ణి' (explorer) కూడా వెంటపెట్టుకుని ఇంకోసారి ఆఫ్రికా సందర్శించాడు. అంతకు ముందు పర్యటించని ప్రాంతాలలో వారు పర్యటించి, విక్టోరియా సరస్సుకి ప్రధానంగా నీరు సరఫరా చేస్తున్న 'కగేరా' నదిని కనుగొన్నారు. అదే నైల్‌నదికి ప్రధానమైన ప్రభవస్థానం అని వారు గుర్తించారు.

---

## సముద్రపు కెరటాల నుంచి విద్యుచ్ఛక్తి

సముద్రపు కెరటాల నుంచి విద్యుచ్ఛక్తి ఉత్పాదించడంలో మొదటిసారి జపాన్ శాస్త్రజ్ఞులు విజయం సాధించారు. జపాన్‌లోని సీటో సింధు శాఖలో కలిసే కిజిమా కాలువలో వారు జరిపిన ప్రయోగం విజయవంతం అయింది. ఆ ప్రయోగంలో కెరటాల పరంపర నీటి టర్బైన్‌లను త్రిప్పుతూ విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు సహాయపడింది.

" 'సత్యం' తత్త్వ శాస్త్రానికి ధ్యేయం;
తత్త్వవేత్తలకు కాదు." —జాన్ ఛర్డన్ కాలిన్స్

# ప్రపంచంలోని ఏడు వింతలు

1. ఈజిప్టులోని పిరమిడ్‌లు:

క్రీ పూ. 2000 ప్రాంతంలో నిర్మించబడిన ఈజిప్ట్ నేలిన 'ఫారో' (రాజు)ల సమాధులు



ఇవి. వీటిలో మిక్కిలి పెద్దది 'ఎల్‌గిజే'లో ఉన్న 'చియోప్స్' పిరమిడ్. దీని ఎత్తు 147 మీటర్‌లు (481 అ. లు).

2. బాబిలోనియాలోని వ్రేలాడే ఉద్యాన వనాలు:

నెబూ చెడ్ నెజార్ రాజ ప్రాసాదం పక్కగా ఎత్తు నేల మీద పెంచిన ఉద్యాన వనాలు (terraced gardens). 23 మొదలు 91 మీటర్‌ల (75-300 అ.ల) ఎత్తున ఆ ఉద్యాన వనాలు కనిపిస్తాయి. క్రీ. పూ. 600 ప్రాంతంలో అప్పటి రాజు కొండ ప్రాంతం నుంచి వచ్చిన తన భార్యను సంతోష పరచడం కోసం ఆ ఉద్యాన వనాలు ఏర్పాటు చేశారు.

3. ఒలింపియాలోని 'జ్యూస్' ప్రతిమ:

ఫిడియాస్ మలచిన 12 మీ.ల (40 అ.ల) ఎత్తు గల ఈ ప్రతిమ క్రీ. పూ. 400 ప్రాంతంలో తొలి ఒలింపిక్ క్రీడలు జరిగిన స్థలంలో ఉంది. దంతంతోనూ, బంగారం తోనూ నిర్మించిన ఈ ప్రతిమలో 'జ్యూస్' (బృహస్పతి - గురుడు) సింహాసనం మీద ఆసీనుడై కనిపిస్తాడు.

4. ఎఫీసస్‌లోని 'డయానా' ఆలయం:

దాదాపు 122 మీటర్‌ల (400 అ.ల) పొడవున 100 పైచిలుకు స్తంభాలతో 18 మీ.ల ఎత్తుగా నిర్మించిన అద్భుతమైన పాల

---

## బాంగ్‌కాక్‌లో బౌద్ధ దేవాలయాలు

తాయిలాండ్ (సయామ్) రాజధాని నగరం అయిన బాంగ్‌కాక్‌లో కన్ను చెదరగొట్టే బౌద్ధ దేవాలయాలు సుమారు 400 ఉన్నాయి. వాటిలో మరకతం (పచ్చరాయి) తో మలచిన బుద్ధుని విగ్రహం గల ఆలయం మతపరంగా చాలా ప్రధానమైంది. ఇంకా అనేక ఉపాలయాలు ఉన్న ఆ ఆలయాన్ని 63 అందమైన ద్వారాలలో దేనిలోనుంచి అయినా ప్రవేశించవచ్చును

---

**"సుఖానికి అవసరమైన మూడు అంశాలు: 1. చేసేందుకు, 2. ప్రేమించేందుకు, 3. ఆశగా ఎదురు చూసేందుకు ఏదో ఒకటి ఉండడం!"** —అలెగ్జాండర్ ఛామర్స్

రాతి మందిరం ఇది. దీని నిర్మాణం క్రీ.పూ. 350 ప్రాంతంలో ఆరంభమైంది. పూర్తిగా నిర్మించడానికి 120 ఏళ్ళు పట్టింది. క్రీ.శ. 262 లో 'గోత్'లు దీనిని నాశనం చేశారు.

5. హాలి కార్నాసస్ నగరంలోని 'మాసలీయమ్':

క్రీ.పూ. 353 లో చనిపోయిన ఆసియా మైనర్‌లోని 'కేరియా' రాజు 'మాసలస్'కి స్మారక చిహ్నంగా ఆయన రాణి ఆర్టిమీసియా నిర్మించిన కట్టడం. దీని ఎత్తు 43 మీటర్లు (140 అ. లు) ఈ 'మాసలీయమ్' తాలూకు కొన్ని ముక్కలు ప్రస్తుతం బ్రిటిష్ మ్యూజియమ్‌లో ప్రదర్శించ బడుతున్నాయి.

6 రోడ్జ్ రేవు పట్టణంలోని 'అపోలో' కంచు ప్రతిమ :

గ్రీకుల సూర్య దేవుడు 'హీలియోస్' (అపోలో) తాలూకు బ్రహ్మాండమైన కంచు ప్రతిమ ఇది 'రోడ్జ్' ఓడరేవు ముఖ ద్వారం వద్ద 36 మీటర్ల (117 అ.ల) ఎత్తున ఈ ప్రతిమ నిలిచి ఉంది. సుప్రసిద్ధ శిల్పి ఛార్లెస్ 12 ఏళ్ళు శ్రమించి ఈ ప్రతిమను మలచడం (క్రీ.పూ. 280 లో) పూర్తి చేశాడు. క్రీ.పూ. 224 లో సంభవించిన ఒక భూకంపం దీనిని నాశనం చేసింది.

7. అలెగ్జాండ్రియాలోని 'ఫారోస్' దీపస్తంభం :

అలెగ్జాండ్రియా (ఈజిప్ట్) ఓడరేవులోని 'ఫారోస్' అనే చిన్న దీవిలో క్రీ. పూ. 270 లో పాలరాతితో నిర్మించిన లైట్ హౌస్ ఇది. దీని ఎత్తు 122 మీ.లు (400 అ.లు). 1375 లో సంభవించిన భూకంపం దీనిని నాశనం చేసింది.

## విరగ బూసే కొత్త రకం గులాబీ



రష్యాలో కొత్త వంగడాల మొక్కలను ఉత్పత్తి చేసే నిపుణులు ఇటీవల 'రడుగా' (రష్యన్ భాషలో 'ఇంద్ర ధనుస్సు') అనే ఒక కొత్తరకం గులాబీని ఉత్పత్తి చేశారు. ఈ వంగడం వేగంగా పెరుగుతుంది రోజూ ఎన్నో పెద్ద పెద్ద మొగ్గలు తొడుగుతుంది. నిపుణుడైన పుష్పలావికుడు ఒక ఉదయం 40 కి.గ్రాముల పూలను (సుమారు 1,00,000 పూలను) కోయవచ్చును. అయితే ఒక ఉదయం కోసిన పువ్వుల నుంచి 13 గ్రాముల 'గులాబి అత్తరు' (rose oil) మాత్రమే లభిసుంది.

"కష్టాలు అనే పిట్టలు తల మీదుగా ఎగురకుండా వారించ లేవు; కాని అవి నీ తల మీద గూడు కట్టుకోకుండా మాత్రం చూసుకో గలవు!" —చైనావారి సామెత

# వనితా లోకం

## సౌందర్య పోషణకు సహజ సాధనాలు

సుబుద్ధీ గోస్వామి

స్త్రీలు తమ సౌందర్య పోషణ కోసం కృత్రిమమైన 'కాస్మెటిక్స్' మీద బోలెడు డబ్బు తగలబెట్టడం కంటె మనకు అతి తేలి



కగా లభించే మెంతులూ, ధనియాలూ, పసుపు వంటి ప్రకృతి సిద్ధమైన సాధారణ వస్తువులు వాడడం ఎంతో ఆరోగ్యకరం। మన రక్తాన్ని శుభ్రపరచి, శరీరానికి అవసరమైన వైటమిన్లనూ, ఖనిజాలనూ కూడా సరఫరా చేస్తూ అవి మనకు ఎంతో మేలు చేస్తాయి.

సౌందర్య పోషణకూ, చిన్న చిన్న సమస్యల నివారణకూ కొన్ని సులభ సూత్రాల ఇక్కడ ఇస్తున్నాము.

మెంతులు :

అప్పుడే కోసుకొచ్చిన మెంతి ఆకుల మెత్తగా నూరి, కొంచెం నిమ్మరసం కలిపి చేసిన ముద్దను ప్రయోగించి వాపులూ, బెణుకు నొప్పులూ, కాలిన గాయాలూ నయం చేసుకో వచ్చును. ఆ ముద్దను రోజూ రాత్రిళ్లు ముఖానికి రాసుకుని, ఉదయాన్నే వేడి నీటితో ముఖం కడుక్కోడం వల్ల ముఖం మీద మొటిమెలూ, పురుపుడు కాయలూ మాయం

### 'షవర్' స్నానం చేయడంలో రికార్డు

ఫ్రాంక్ ఫర్ట్ (పశ్చిమ జర్మనీ) కి చెంది క్లెమెన్స్ మ్యూలెర్ అనే 42 ఏళ్ళ వ్యక్తి ఇటీవల 360 గంటల పాటు వరుసగా 'షవర్' క్రింద ఉండి కొత్త ప్రపంచ రికార్డు స్థాపించాడు. ఇంతకు ముందు ఆయనే స్థాపించి రికార్డుకంటె ఇది 19 గంటలు ఎక్కువ।

"తెలిసింది తక్కువా, గ్రహించేది ఎక్కువా గనుక స్త్రీలు పురుషుల కంటె తెలివైన వారు।" —— వెన్

వటమే కాకుండా, చర్మం ముడతలు దదు. చర్మ సౌందర్య పోషణకు ఇది అమో ంగా పని చేస్తుంది.

చారెడు మెంతులు పెరుగులో కలుపుకుని నడం 'గ్రహణి' (రక్త విరేచనాలు)





్యాధికి మంచి మందు. మెంతులు పాలతో ారి చేసిన ముద్దను చర్మ సౌందర్య పోషకం cosmetic)గా వాడవచ్చును. మెంతులు ారిన ముద్దను తలకు రాసుకుని తల రుద్దు ంటే వెంట్రుకలు రాలి పోవడం, బట్టతల ్పడడం, తల మీద చుండ్రు వ్యాపించడం ంటివి జరుగవు. జుట్టు నల్లగానూ, ఒత్తు నూ పెరగడానికి కూడా అది దోహదం స్తుంది. మెంతి గింజలు నానబెట్టిన కొబ్బరి ానె కేశ సౌందర్యాన్ని పెంపొందిస్తుంది.

**సుపు :**

పసుపు హిందువులకు పవిత్రమైంది. అన్ని భ కార్యాలకూ ముందుగా పసుపు అవసరం. ారలలో, పులుసులో రుచి కోసం, రంగు వడం కోసం పసుపు పొడి వేస్తారు. మసా ళాలో చేర్చే ముఖ్యమైన దినుసులలో పసుపు ఒకటి.

ఔషధంగానూ, సౌందర్య పోషకంగానూ కూడా పసుపు చాలా ముఖ్యమైంది. రక్త శుద్ధికి పసుపు తోడ్పడుతుంది. చారెడు పసుపూ, చిటికెడు మిరియపు పొడీ వేసి కాచిన పాలు జలుబు, గొంతు నొప్పి, దగ్గుల మీద అమోఘంగా పని చేస్తుంది. వాము (thymol) పొడిలో ఉల్లి రసం చేర్చి రాస్తే చిడుము, దురదలు మొదలైన చర్మవ్యాధులు నయం అవుతాయి.

పసుపు పొడిలో ఉప్పు చేర్చి పళ్ళ పొడిగా వాడితే పళ్ళకు చాలా మంచిది. నోటి దుర్వాస ననూ, పంటి పోటునీ అది అరికడుతుంది. సమభాగాలలో పసుపు పొడి, మిరియపు పొడి, సైంధవ లవణం కలిపిన నారంజ రసం రాత్రిళ్ళు సేవిస్తే నిద్ర మత్తును దరి చేయ నీయదు. ఎలాంటి అలసటా లేకుండా చేస్తుంది. రాత్రి పూట ప్రొద్దు పోయే దాకా చదువుకునే విద్యార్థులకు ఇది గొప్ప వరం.

"భార్య గుడ్డిదీ, భర్త చెవిటివాడూ అయితే
ఆ దాంపత్యం చక్కగా సాగుతుంది." —మాంటెన్యూ

సౌందర్య పోషకంగా కూడా పసుపు ప్రయోజన కారి. పసుపు పొడి, చందనపు పొడి, ఉలవపిండి మీగడలో కలిపి ముఖానికి రాసుకుంటే చర్మ సౌందర్యం, ముఖ శోభ ఇనుమడిస్తాయి. ముఖం మీది మచ్చలను తొలగించడానికీ, కేశాలు మొలవకుండా చూడ డానికీ కూడా అది తోడ్పడుతుంది.

చింత పండు :

చింతపండులో వైటమిన్ 'పి' ఎక్కువగా ఉంటుంది. దక్షిణాదిని అంతటా వంటకాలలో



చింతపండు ఎక్కువగా వాడుతారు. చింత పండు గుజ్జు మంచి జీర్ణకారి, క్రిమి సంహారి, విరేచనకారి. మద్యం వల్ల ఏర్పడే వికారా లకు అది విరుగుడు. చింతపండు గుజ్జు, అరటిపండు గుజ్జు, పజ్జిగ కలిపి సేవిస్తే విరేచనాల మీదా, అజీర్తి మీదా బాగా పని చేస్తుంది.

చింతపండు గుజ్జుతో బెల్లం, జీలకర్ర పొడి కలిపి ముప్పూటలా సేవిస్తే కామెర్ల వ్యాధి, వికారం, వాంతులు తగ్గుతాయి. చింత పండు గుజ్జు ఉడికించి పట్టుగా వేస్తే బెణు కులూ, వాపులూ తగ్గుతాయి. వ్యాధి కారక క్రిములు చేరకుండా గాయాలనూ, పుళ్ళనూ అది కాపాడుతుంది.

జీలకర్ర :

జీలకర్ర కూడా మంచి జీర్ణకారి. అర చెంచాడు వేయించిన జీలకర్ర పొడి భోజనా



నంతరం సేవిస్తే జీర్ణశక్తి పెరిగి, గాస్ చేరకుండా చూస్తుంది. చెంచాడు జీలకర్ర నీళ్ళలో వేసి సన్న సెగను కాచి ఒక చిటి కెడు ఉప్పు, కాస్త వెన్నపూస వేసి వేడి వేడిగా తాగితే అది ఒంట్లో వేడిని తగ్గిస్తుంది. పొత్తి కడుపులో నొప్పిని తగ్గించి మూత్రం జారీ అయేట్టు చేస్తుంది.

మామూలు ఉప్పుకు కాస్త కూరల సోడా కూడా కలిపి దానితో పళ్ళు తోముకుంటే పళ్ళు తళ తళ లాడుతూ ఉంటాయి. దానిలో ఆవ నూనె కూడా కలిపి చిగుళ్లను మర్దిస్తే చిగుళ్ళు గట్టి పడుతాయి.

('ఆర్ట్ ఆఫ్ లివింగ్' సౌజన్యంతో)

" 'చదువు'లో ఆశ్చర్యం గొలిపే అంశం: నిర్జీవ సత్యాల రూపంలో అది బోధించే అజ్ఞానం!" —హెన్రీ ఆడమ్స్

(24వ పేజీ తరువాయి)
పల్లి పరిణతి ఏర్పడింది. మాటలో నెమ్మదీ, గాంతం వచ్చాయి.

1920 లో కలకత్తాలో జరిగిన ప్రత్యేక కాంగ్రెస్ మహాసభకు అధ్యక్షత వహించవలసిం దని ఆయనను కోరారు. కాని అది ఆయనకు సంతోషాన్ని కలిగించలేక పోయింది. అప్పుడే తన ప్రాణ మిత్రుడు తిలక్ పరమపదించడం జరిగింది. కలకత్తా కాంగ్రెస్‌లోనే భారత రాజకీయ గగనంలో ఉజ్వలమైన ఒక నూతన తార ఉదయించడం, ఆ తార కాంతి ముందు వెనుకటి తార లన్నీ వెలవెల బోవడం జరిగింది. ఆ నూతన తార మరెవరో కాదు – మహాత్మా గాంధీః భారత రాజకీయాలలో ఆయన ప్రవేశించగానే అనీ బెసెంట్, పండిత మదన్ మోహన్ మాలవ్య, బిపిన్ చంద్రపాల్ వంటి వా రెందరో రంగం నుంచి తప్పుకోవలసి వచ్చింది. బ్రిటిష్ ప్రభుత్వంతో సహాయ నిరాకరణం జరుపా లనే గాంధీజీ నూతన విధానంతో లజ్‌పత్ రాయ్ కూడా ఏకీభవించ లేక పోయారు.

ఆ నాటి నుంచీ లజ్‌పత్ రాయ్ తన సమయాన్ని సాంఘిక, విద్యా విషయక కృషిలో ఎక్కువెక్కువగా వినియోగింప సాగారు. రాజకీయాలలో తిలక్ సిద్ధాంతాలను సమర్థించే 'సర్వెంట్స్ ఆఫ్ ది పీపిల్ సొసైటీ'ని ఆయన స్థాపించారు. సంఘ సంస్కరణలో, జాతీయ పునరుజ్జీవనంలో యువకులకు శిక్షణ ఇవ్వడం ఆ సంస్థ ప్రధాన లక్ష్యం. ఆ సంస్థ తరపున 'పీపుల్' అనే పత్రికను ప్రారంభించారు. లాహోర్‌లోని డి.ఏ.వీ. కళాశాల స్థాపనలో కూడా ఆయనకు ప్రముఖ పాత్ర ఉంది.

కాంగ్రెస్ నుంచి తప్పుకున్నా, రాజకీయాలకు ఆయన దూరంగా లేరు. చిత్తరంజన్ దాస్, మోతీలాల్ నెహ్రూలతో చేరి 'స్వరాజ్య' పార్టీ స్థాపించారు. సెంట్రల్ అసెంబ్లీ సభ్యుడు
(మిగతా 47వ పేజీలో)

## మధుర ఆలయంలో సప్త స్వర స్తంభం



మధురలోని మీనాక్షీ దేవి ఆలయంలో ఉత్తరం వైపు అసంపూర్తిగా మిగిలి ఉన్న గోపురం సమీపంలో ఏకాండ శిలతో నిర్మించిన సప్త స్వరాలు పలికే సంగీత స్తంభం ఉంది. ఈ స్తంభంలోని ఏడు ముఖాల నుంచి జల తరంగిణి వాద్యంలో వెలువడే స్వరాల వంటివి వినిపిస్తాయి.

"ప్రేమలేని పెళ్ళిని ఒప్పుకుంటే,
పెళ్ళిలేని ప్రేమను ఎందుకు ఒప్పుకోకూడదు!"          –ఫ్రాంక్లిన్

# నిజాలు-నిదర్శనాలు

## చెత్త తొలగించేందుకు పెట్టే ఖర్చు:

437 చ. కి. మీ. ల స్థలంలో దాదాపు 85 లక్షల జనాభా జీవిస్తున్న - మొత్తం 1,400 కి. మీ. ల పొడవున రోడ్లు ఉన్న-బొంబాయి నగరంలో మునిసిపల్ కార్పొరేషన్ వారు రోజూ నగరంలో పోగుపడే సుమారు 3,000 టన్నుల 'చెత్త'ను తొలగించడం కోసం ఏటా రూ. 17 కోట్లు ఖర్చు చేస్తున్నారు.

* * *

## రసాయనపు ఎరువుల వాడకంలో పెరుగుదల:

ఈ నాడు వ్యవసాయంలో నత్రజని ఎరువులు కీలక పాత్ర నిర్వహిస్తున్నాయి 1951లో ఇండియా ఒక లక్ష టన్నుల నత్రజని ఎరువులను మాత్రమే ఉత్పత్తి చేస్తూ ఉండగా, ఈ నాడు 50 లక్షల టన్నుల నత్రజని ఎరువులు దేశంలో ఉత్పత్తి అవుతున్నాయి. 1990 నాటికి మనకు 95 లక్షల టన్నులూ, 2,000 నాటికి 1.5 కోట్ల టన్నులూ నత్రజని ఎరువులు అవసరం అవుతాయి.

* * *

## మన ప్రాథమిక పాఠశాలల దురవస్థ:

నాలుగో 'ఆల్ ఇండియా ఎడ్యుకేషనల్ సర్వే' నివేదిక ననుసరించి ప్రస్తుతం

## ఫ్రీ మేసన్ అంటే...?



యూరప్‌లోని నేటి 'ఫ్రీ మేసన్' క్లబ్‌లు ఆదిలో ఎలా ఏర్పడ్డా యనే విషయం కొన్ని శతాబ్దాల పాటు వివాదగ్రస్తంగా ఉండేది మధ్య యుగంలో ఇంగ్లండ్‌లో మొదట రాతి పని మేస్త్రీలు సంఘాలుగా ఏర్పడి వాటి 'ఫ్రీ మేసన్' సంఘాలు అనేవారనీ. అవి ఒక రకం వృత్తి సంఘాలు అనీ, అవే క్రమంగా నేటి 'ఫ్రీ మేసన్' క్లబ్‌లుగా పరిణమించాయనీ ఇప్పుడు అందరూ అంగీకరిస్తున్నారు

"ప్రపంచంలోని అందమైన వాక్యాలన్నీ ఏకమైనా ఒక అందమైన 'చేత'తో సరితూగలేవు!" - జె. ఆర్. లోవెల్

దేశంలో ఉన్న ప్రాథమిక పాఠశాలలలో 40 శాతం పూరిపాకలలోనో, డేరాలలోనో, ఆరుబయటనో నడుపబడు తున్నాయి. 1.5 మొదలు 2 లక్షల పాఠశాలలలో పిల్లలు కూచునేందుకు కనీసం చాపలు గాని, ఇతర ఫర్నిచర్ గాని లేదు.

* * *

## 2 లక్షలమంది పనిచేస్తున్న పరిశోధక సంస్థలు:

ప్రస్తుతం మన దేశంలో శాస్త్రపరిశోధన కొనసాగిస్తున్న పరిశోధన సంస్థలలోనూ, ప్రయోగశాలలలోనూ దాదాపు 2 లక్షల మంది దాకా శాస్త్రజ్ఞులూ, ఇతరులూ పని చేస్తున్నారు. విజ్ఞాన శాస్త్రాభివృద్ధికి సంబంధించిన 1 ప్రభుత్వ శాఖల యాజమాన్యం క్రింద 200, కేంద్ర ప్రభుత్వం క్రింద 160, రాష్ట్ర ప్రభుత్వాల క్రింద 170, యూనివర్సిటీలూ, ఇతర జాతీయ సంస్థల క్రింద 135 పరిశోధక సంస్థలు పనిచేస్తున్నాయి. ఇవి కాక ప్రజారంగంలోని పరిశ్రమలలో పరిశోధన సౌకర్యాలు ఉన్నట్టు ఆమోదించబడిన పరిశ్రమలు 700 దాకా ఉన్నాయి.

* *

## న్ సౌకర్యంలో స్వీడెన్ ముందంజ:

దేశం జనాభాలో మిక్కిలి ఎక్కువ శాతం మందికి టెలిఫోన్ సౌకర్యం ఉన్న దేశం ఈ నాడు స్వీడెన్. ప్రపంచంలోని వివిధ

## మంచులో పెంచిన పిండం నుంచి పుట్టిన తొలి పాప



4 నెలలపాటు మంచులో గడ్డకట్టించి ఉంచిన పిండం నుంచి మొట్టమొదటి టెస్ట్ ట్యూబ్ పాప ఇటీవల మెల్బోర్న్ (ఆస్ట్రేలియా) లో జన్మించింది. 33 ఏళ్ళ వయస్సు గల ఒక కిండర్‌గార్డెన్ టీచర్ గర్భంనుంచి తీసిన అండాలను (eggs) ఆమె భర్త ఇంద్రియం (sperm) తో ఫలదీకరించి, అలాంటి 6 పిండాలను (embryos) 4 నెలలపాటు మైనస్ 200 డిగ్రీల ఉష్ణోగ్రత వద్ద గడ్డకట్టించి భద్రపరిచారు. 4 నెలల తరువాత వాటికి మామూలు ఉష్ణోగ్రత కలిగించినప్పుడు వాటిలో మూడు పిండాలుమాత్రమే సజీవంగా ఉన్నాయి. వాటిలో ఒకదానిని తల్లి గర్భంలో ప్రవేశపెట్టగా తత్ఫలితంగా 'జో' (zoe) అనే 5½ పౌనుల పాప జన్మించింది. 'జో' అనే గ్రీక్ మాటకు అర్థం — 'జీవన వరం' (gift of life) అని.

"నీ వెనుకా, నీ ముందూ ఉన్నదాని కంటె
నీ లోపల ఉన్నది మరింత ముఖ్యం!"

దేశాలలో ప్రతి 100 మంది లోనూ టెలిఫోన్ సౌకర్యం గలవారి సంఖ్యలు ఈ క్రింది విధంగా ఉన్నాయి:

| | | |
|---|---|---|
| స్వీడెన్ | —82.8 | శాతం |
| అమెరికా | —79.2 | ,, |
| స్విట్జర్లండ్ | —74.9 | ,, |
| కెనడా | —70.0 | ,, |
| డెన్మార్క్ | —67.3 | ,, |

1981 నాటికి ప్రపంచంలో మొత్తం 52.8 కోట్ల టెలిఫోన్‌లు ఉన్నాయి.

* * *

## 600 శాతం పెరిగిన కాలేజీలు:

ఇవాళ ఇండియాలో 6-11 ఏళ్ళ వయస్సు గల బాల బాలికలలో 87 శాతం స్కూళ్ళలో చదువుతున్నారు. 30 ఏళ్ళ క్రితం ఆ వయో వర్గంలో 33 శాతం మాత్రమే చదివేవారు. గత 25 ఏళ్ళలోనూ యూనివర్సిటీ విద్యార్థుల సంఖ్య తొమ్మిదింతలైంది - అదే కాలంలో కాలేజీల సంఖ్య 600 శాతం పెరిగింది.

* * *

## ఇండియాలో ఉన్మాదులు:

వర్ధమాన దేశాలలో ఎలాంటి చికిత్స లేకుండా విచ్చల విడిగా తిరుగుతున్న కోట్ల మంది ఉన్మాదులలోనూ 80 లక్షల మంది ఇండియాలోనే ఉన్నారు. వారిలో 8 శాతం మంది గ్రామీణ ప్రాంతాలలో ఉన్నారు. తగిన వైద్య సౌకర్యాలు లోపించడం వల్ల 20 శాతం మందికి మాత్రమే ప్రస్తుతం చికిత్సా సౌకర్యాలు లభిస్తున్నాయి.

( 4 వ పేజీ తరువాయి)

గా గొప్ప 'పార్లమెంటేరియన్' అని పేరు తెచ్చుకున్నారు. ఆయన ప్రసంగాలు వివేక భరితాలు గానూ, ధైర్య దర్పణాలు గానూ ఉండేవి. అయితే - అగ్రనాయకులతో అభిప్రాయ భేదాలు వచ్చి, 1928 లో ఆయన 'స్వరాజ్య' పార్టీ నుంచి రాజీనామా చేశారు.

ఆరోగ్యం క్షీణిస్తున్నా ప్రజాహిత కార్యాలలో పాల్గొనడం ఆయన మానలేదు. 1928లో సైమన్ కమిషన్ పట్ల నిరసన తెల్పడానికి లాహోర్‌లో సమావేశమైన ప్రజా సమూహం మీద పోలీసులు లాఠీ ఛార్జ్ చేశారు. ఆ లాఠీ ఛార్జ్‌లో తీవ్రంగా గాయపడి, తత్ఫలితంగానే 1928 నవంబరు 17వ తేదీన లాలా లజ్‌పత్ రాయ్ కన్ను మూశారు. ఆయన మరణవార్త దేశంలో అపారమైన సంచలనాన్ని కలిగించింది. భగత్ సింగ్ నాయకత్వాన ముగ్గురు విప్లవ వీరులు లజ్‌పత్ రాయ్‌పై లాఠీ ఛార్జ్ చేసిన బ్రిటిష్ సార్జంట్‌ను హత చేసి, అతని మీద తమ పగ తీర్చుకున్నారు. తత్ఫలితంగా 1931 లో ఆ ముగ్గురు విప్లవ వీరులనూ ఉరి తీశారు.

భారత స్వాతంత్ర్యం కోసం పంజాబ్‌లో ఆత్మార్పణ చేసిన ఇద్దరు మహా యోధులు లాలా లజ్‌పత్‌రాయ్ సర్దార్ భగత్ సింగ్‌లు కలకాలం భారతీయుల స్మృతి పథంలో మెసులుతూనే ఉండ గలరు.

"మనిషికి ఎలా జీవించాలో నేర్పడమే మతా లన్నిటికీ చరమ లక్ష్యం!"

# జాతీయ వార్తలు

## సిల్కు ఎగుమతులలో రికార్డు:

'కేంద్ర సిల్కు బోర్డు' వారి 1982 - 83 సం వు వార్షిక నివేదిక ప్రకారం ఆ సంవత్స రంలో మన సిల్కు ఎగుమతులు రికార్డు స్థాయి నందుకుని, రూ. 82.85 కోట్ల విదేశీ మారక ద్రవ్యాన్ని మనకు సంపాదించి పెట్టాయి.

* * *

## మూడు చక్రాల బళ్ల ఫాక్టరీ:

రూ. 7.5 కోట్ల పెట్టుబడితో ప్రభుత్వ రంగంలో నెలకొల్పబడిన 'కేరళ ఆటో మొబైల్స్ లిమిటెడ్' ఇటీవల తిరువనంత పురానికి 16 కి.మీ. ల దూరాన ఉన్న అతియ నూర్‌లో పని చేయడం ప్రారంభించింది. వ. భారతంలో మొట్టమొదటి సారిగా వెల సిన ఈ ఫాక్టరీ పూర్తి ఉత్పత్తి స్థాయి నందు కుంటే ఏటా 8,000 ఆటో రిక్షాలూ, 1000 డెలివరీ వానులూ, 1000 'పిక్ అప్' ట్రక్‌లూ ఇక్కడ ఉత్పత్తి కాగలవు.

## 982-83 లో మన వజ్రాల గుమతులు:

సుమారు రూ. 1,000 కోట్లు విలువ చేసే

## టెన్నిస్‌లో మూడోసారి ప్రపంచ ఛాంపియన్ మెక్‌ఎన్రో



అమెరికాకు చెందిన జాన్ పాట్రిక్ మెక్ ఎన్రో మొన్న జూలై 8 న లండన్‌లో జరి గిన పురుషుల ప్రపంచ టెన్నిస్ పోటీలలో తోటి అమెరికన్ ఆటగాడు జిమ్మీ కానర్స్‌ను 6-1, 6-1, 6-2 స్కోర్‌లతో ఓడించి, మూడోసారి ప్రపంచ ఛాంపియన్ అయాడు. ఆయన చేతిలోని బాట్ ఆ చేతిలో ఒక భాగం అయినట్టూ, బాట్‌తోనే ఆయన పుట్టినట్టూ అనిపిస్తుం దనీ టెన్నిస్ ఆటలో ఆయన ప్రతిభను ప్రశంసిస్తారు.

"'గతాన్ని' నువు మార్చలేవు; కాని, 'భావి'ని గూర్చిన ఆందోళన వల్ల 'వర్తమానాన్ని' మాత్రం ధ్వంసం చేసుకోగలవు!"

వజ్రాలనూ, వజ్రాభరణాలనూ 1982-83 లో విదేశాలకు ఇండియా ఎగుమతి చేసింది. హాలండ్, కెనడా, థాయ్‌లండ్, లెసోతో మున్నగు దేశాలకు ఈ ఎగుమతులు జరిగాయి.

* * *

## ఇండియాలో మొట్ట మొదటి పింగాణీ పెంకుల ఫ్యాక్టరీ:

తిరుపతి సమీపంలోని నరసింగపురంలో నెలకొల్పబడుతున్న ఒక కంపెనీ ఇండియాలో మొట్టమొదటి సారిగా నేల మీద పరుచుకునే పింగాణీ పెంకులను ఉత్పత్తి చేయబోతూంది. మొజాయిక్ పెంకుల బరువులో 1/3 వ వంతు బరువు మాత్రమే ఉండే ఈ పింగాణీ పెంకులు వాటికంటె ఎక్కువ బలమైనవి. వీటి మీద గీట్లు పడవు; మంటలకు ఇవి పాడు కావు; తిరిగి తిరిగి వీటిని పాలిష్ చేసే పని ఉండదు.

* * *

## రెండు ఇంధనాలతో నడిచే బస్సు:

ఇండియాలో మొట్టమొదటి సారిగా రెండు ఇంధనాలతో (ద్రవ రూపమైన పెట్రోలియమ్ గాస్, డీసెల్ నూనెల మిశ్రణం) నడిచే బస్సును తమిళనాడు ప్రభుత్వం నడుపుతున్న మద్రాసులోని పల్లవన్ ట్రాన్స్‌పోర్టు కార్పొరేషన్ వారు ఇటీవల ప్రవేశ పెట్టారు. ఇంతకు ముందు సగటున రోజుకి 63 లిటర్ల డీసెల్ నూనె అవసరం అయే బస్సుకు ఈ మిశ్రమం వాడడం వల్ల ఇప్పుడు 42 లీటర్ల డీసెల్ నూనె సరిపోతుంది.

## ఎక్కువ భాషలలోకి అనువదింపబడిన రచయిత్రి



'అగాతా క్రిష్టి' అనే బ్రిటిష్ రచయిత్రిని డిటెక్టివ్ నవలా జగత్తుకు రాణి అనవచ్చును. ప్రపంచంలో మిక్కిలి ఎక్కువ భాషలలోకి అనువాదం పొందింది ఆమె రచనలే అని ఇటీవల యునెస్కో వారు జరిపిన సర్వే వల్ల తేలింది. 26 దేశాలలో ఆమె రచనలు 282 సార్లు అనువదింపబడ్డాయి. ఈ విషయంలో ఆమె తరువాత చెప్పుకోదగ్గ వ్యక్తి మరొక బ్రిటిష్ రచయిత్రి బార్బరా కార్ట్‌లాండ్. ఆమె వ్రాసిన శృంగార నవలలు 137 సార్లు అనువదించబడ్డాయి. పురుషులలో వీరి దరిదాపులకు వచ్చే రచయిత 104 అనువాదాలు గల జారెస్ సిమియన్.

"సంభాషణ అంటే ఎదుటివారిని ప్రశ్నలు వేయడం కాదు."—శామ్యూల్ జాన్సన్

## భారత రైలు మార్గం విద్యుదీకరణ :

7 వ పంచవర్ష ప్రణాళిక పూర్తి అయే సరికి మన దేశంలోని ప్రధాన రైలు మార్గాలన్నింటినీ విద్యుదీకరిస్తారు. న్యూఢిల్లీ - బొంబాయి, న్యూఢిల్లీ - మద్రాసు మార్గాల విద్యుదీకరణ 1987 నాటికి పూర్తి అవుతుంది. ఎలెక్ట్రిక్ ఇంజన్ల వాడకం వల్ల రైల్వేల నిర్వహణ ఖర్చులలో 15 శాతం కలసి వసుంది.

* *

## బంగారం ఉత్పత్తిలో ఆంధ్ర ప్రదేశ్ ప్రాధాన్యం :

ఇండియాలో కర్ణాటక తరువాత ఆంధ్ర ప్రదేశ్ బంగారాన్ని ఎక్కువగా ఉత్పాదిస్తున్న రాష్ట్రం. అనంతపురానికి సుమారు 65 కి.మీ.ల దూరంలో ఉన్న రత్నగిరి బంగారు గనులలోని 'యెప్పమాను' గనిని ఇటీవలనే జాతికి అంకితం చేశారు. ప్రస్తుతం ఆ గనిలో ఉన్న బంగారం నిలువలు మరో దశాబ్ది దాకా

* * *

## రహదారుల నిర్వహణలో హర్యానా ముందంజ :

హర్యానాలో 1966 లో 5,100 కి.మీ.ల పొడవు రహదారులు మాత్రమే ఉండగా, నేడు 19,415 కి.మీ ల పొడవున రోడ్లు ఏర్పడ్డాయి. ప్రస్తుతం 'హర్యానా రోడ్ వేస్' సంస్థకు 2,738 బస్సులు ఉన్నాయి. అవి రోజూ 7.34 లక్షల కి.మీ ల దూరానికి సుమారు 10 లక్షల మంది ప్రయాణికులను చేరవేస్తున్నాయి. మన 'యూనియన్ ప్లానింగ్ కమిషన్' వారు ఇండియాలోని అన్ని రాష్ట్రాలలోనూ హర్యానాయే రహదారుల నిర్వహణలో ముందంజ వేసినట్లు నిర్ణయించారు.

* * *

## 'లక్ష ద్వీప్'లో 24 గంటలూ విద్యుచ్ఛక్తి సరఫరా :

కేంద్ర పాలిత ప్రాంతాలలో మొట్ట మొదటి సారిగా అరేబియా సముద్రంలోని 'లక్ష ద్వీప్' పౌరులకు 24 గంటలూ విద్యుచ్ఛక్తిని సరఫరా చేస్తుంది. ప్రపంచంలో నిరంతరాయంగా విద్యుచ్ఛక్తి సరఫరా అయే పగడపు దీవి ఇది ఒక్కటే!

## ఇండియన్ రైల్వేల ఘనత



సుమారు 11,000 రైళ్ళు రోజూ 61,000 కి.మీ. ల దూరం ఇండియాలో ప్రయాణిస్తున్నాయి. తూర్పున లిడో, లఖ్ పానీ స్టేషన్ల నుంచి పడమట 'కాండ్ల' స్టేషన్ దాకా, ఉత్తరాన జమ్మూ స్టేషన్ నుంచి దక్షిణాన కన్యాకుమారి స్టేషన్ వరకూ మొత్తం 7,072 స్టేషన్ల మీదుగా ఆ రైళ్ళు ప్రయాణిస్తున్నాయి.

"ఒంటరిగా ప్రయాణం చేసేవారే తమ గమ్యాన్ని తొందరగా చేరుకుంటారు." —కిప్లింగ్

# కలం స్నేహితులు

(మీ పేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈ శీర్షిక క్రింద ప్రచురించబడాలంటే తగిన వివరాలతో సహా రూ. 5/- లు మనియార్డరు ద్వారా పంపండి. —సంపాదకుడు)

1. బి. చక్రధర పాత్రో, 18 సం. లు, ఇంటర్ రెండవ సం. రం విద్యార్థి, S/o బి. ఆర్. మోహన్‌రావ్‌పాత్రో, సివిల్ మేస్త్రీ, కాంప్ సెక్షన్, ఒనక ఢిల్లీ (కోరాపుట్ జిల్లా-ఒరిస్సా), 764 042.

చిత్రలేఖనం, స్టాంపుల సేకరణ, కలం స్నేహం.

2. ఎస్. శ్రీనివాస రావు, 19 సం.లు, బి. కామ్ మూడవ సంవత్సరం విద్యార్థి. 6, యాకుబ్‌గార్డెన్ స్ట్రీట్, పెరంబూర్ బారక్స్, మద్రాసు-600 012.

జోకులు వేయడం, పుస్తక పఠనం.

3. వాసిరెడ్డి వేణుగోపాల్, 20 సం. లు, దర్గాపురం, కాలేజ్ రోడ్డు, జగ్గయ్యపేట (కృష్ణా జిల్లా) - 521 175.

కళారాధన, సాహితీ విమర్శ, కొటేషన్‌ల సేకరణ.

4. ఎన్. గంగాధర్, బి. ఎస్‌సి., సిరికొండ పోస్టు, వయా దరిపల్లి (నిజామాబాద్ జిల్లా) - 503 165.

కలం స్నేహం, ప్రకృతి ఆరాధన, చదరంగం ఆడడం.

5. జైన శ్రీనివాస్, 18 సం. లు, S/o జైన విశ్వనాథం, ముదిమాణిక్యం, (కరీం

## 'జ్యోతిర్మయానంద' దృష్టిలో 'విస్‌డమ్'



"ఆచరణ యోగ్యమైన, ప్రబోధాత్మకమైన అవసరమైన భోగట్టాను అందజేసే, అందరినీ వినోదపరచే రకరకాల వ్యాసాలు 'విస్‌డమ్'లో వస్తున్నాయి. అవి అన్నీ సంక్షిప్తంగానూ, కచ్చితంగానూ, ఆహ్లాదకరంగానూ ఉండడం గొప్ప విశేషం: సూక్ష్మమైన ఆధ్యాత్మిక రహస్యాల నుంచి, అత్యాధునికమైన వైజ్ఞానిక ఆవిష్కరణల దాకా ఎన్నెన్నో అంశాలు అందరికీ సుబోధంగా ఉండే భాషలో ప్రకటించే 'విస్‌డమ్'కు నానాటికీ ప్రజాదరణ ఎక్కువ అవుతూ ఉండడంలో ఆశ్చర్యం లేదు." —జ్యోతిర్మయానంద

"ఉత్తముల మాట నెమ్మది; చేత కచ్చితం!" —కన్‌ఫ్యూషియస్

నగర్ జిల్లా), 505 530.

కలం స్నేహం, రచనలు చేయడం, చదవడం.

6 ఆర్. ముక్తీశ్వర్, 20. సం.లు, C/o భార్గవీ కార్పొరేషన్. ఛాంబర్ ఆఫ్ కామర్స్ బిల్డింగ్, గ్రీన్ మార్కెట్, వరంగల్_506 001.

స్టాంపుల సేకరణ, నాణేల సేకరణ, సంఘసేవ చేయడం.

7. సి. హెచ్ వెంకటేశ్వర రావు, 25 సం.లు, ఇం.నెం. 25_4_85. విష్ణుపురి, కాజీపేట (వరంగల్ జిల్లా) 506 003.

సినీమాలు చూడడం, పుస్తకాలు చదవడం, ప్రయాణాలు చేయడం.

8. పోలేపల్లి రఘునాథ గుప్త, 21 సం. లు, ఇం. నెం. 3_18. మేడికుర్తి (చిత్తూరు జిల్లా), 517 237.

పాటలు వినడం, డిటెక్టివ్ నవలలు చదవడం. సంఘసేవ.

9. బి. రాజేంద్రకుమార్, 21 సం.లు బి. ఎస్‌సి; ఇం. నెం. 3_1_78/2 క్రిస్టియన్ కాలనీ, కరీం నగర్_505 002.

గ్రంథ పఠనం, ఫొటోలు తీయడం, క్రికెట్ ఆడడం.

10. కుమారి జగదీశ్వరి, 16 సం.లు C/o వి. సూర్యనారాయణ, మెయిన్ రోడ్డు, కోరాపుట్_764 020 (ఒరిస్సా).

ప్రయాణాలు చేయడం, అందాన్ని ఆరాధించడం, కలం స్నేహం.

11. ఏ. శ్రీనివాస్, 19 సం.లు. బి.ఏ. రెండవ సం. రం విద్యార్థి, S/o వెంకయ్య, ఇం. నెం, 5_91, ఎల్.బి. నగర్, హైద్రాబాద్_500 963.

విజ్ఞానదాయకమైన పుస్తకాలు చదవడం, బీదవారికి సహాయపడడం, సంఘసేవ

12. యాంద్రపు శౌరి. జ్ఞానాపురము, ఇం. నెం. 34_9_24, రాసా వీధి, విశాఖ పట్టణం_4.

మంచిని పెంచుట, చెడును మాన్పుట, పెద్దలను గౌరవించుట.

## అత్యాధునిక మైన ధ్రువ పరిశోధక నౌక



జర్మన్ పరిశోధక నౌక 'పోలార్ స్టెర్న్' (polarstern)ను అత్యాధునిక సౌకర్యాలతో నిర్మించారు. అంటార్కిటిక్ ప్రాంత పరిశోధనలలో నిమగ్నమైన ఈ నౌక ఇంజన్‌లు 20,000 అశ్వాల శక్తితో పనిచేయగలవు. అందుచేత ఒకమీటర్ మందం ఉన్న మంచు గడ్డలను కూడా ఛేదించుకుని ఈ నౌక ముందుకు సాగిపోగలదు.

"ధైర్యం, ప్రతిభ మంత్రశక్తి గలవి;
మొదలుపెట్టు! పని అదే పూర్తి అవుతుంది!" —గొయిథే

(16 వ పేజీ తరువాయి)
పోటీలలో బ్రూస్ జెన్నర్ అనే అమెరికన్ నెలకొల్పిన 8,617 పాయింట్ల రికార్డును భగ్నంచేశాడు. పోర్చుగల్‌కు చెందిన బ్యాంక్ ఆఫీసర్ కార్లోస్ లోప్స్ పురుషుల మరాతన్ పోటీలో పసిఫిక్ మహాసముద్ర తీరపు పట్టణం శాంతా మోనికా నుంచి 42.195


పరుగు పందెం క్రీడాకారుడు

కి.మీ.ల దూరం పరుగెత్తి స్వర్ణపతకం సాధించాడు. గం. 2 ల, ని. 9 ల, సె. 21 లలో ఆయన ఆ దూరం పరుగెత్తి, అంతకు ముందు 1976 లో తూ. జర్మనీ శాలూకు వాల్టిమర్ సీర్ పిన్‌స్కీ నెలకొల్పిన రికార్డు గం. 2 ల, ని. 9 ల, సె. 55 లను అధిగమించాడు

ఫైనల్‌లో ఫ్రాన్స్ 2-0 స్కోర్‌తో బ్రెజిల్‌ను ఓడించి ఫుట్‌బాల్ ఆటలో స్వర్ణపతకం సాధించింది. ఆ ఫైనల్ మాచ్‌ని 1,01,799 మంది ప్రేక్షకులు తిలకించారు. అమెరికాలో


స్టాబో

ఆ మాచ్ చూడవచ్చే ప్రేక్షకుల సంఖ్య విషయంలో ఇది రికార్డు.

ప. జర్మనీకి చెందిన ఉల్‌రికెమేఫార్త్ స్త్రీల హైజంప్‌లో స్వర్ణపతకం గెలుచుకుంది.

## మూడు 'డిజపాయింట్‌మెంట్' లు

ప్రపంచంలో మూడు ప్రధాన 'డిజపాయింట్ మెంట్' (ఆశాభంగం) లు కనిపిస్తున్నాయి. ఆస్ట్రేలియాలో ఒక ప్రాంతంపేరు 'డిజపాయింట్ మెంట్'. పసిఫిక్ మహాసముద్రంలో 'డిజపాయింట్ మెంట్' అనే ఒక దీవి ఉంది. అమెరికా పశ్చిమ సముద్ర తీరాన ఒక సముద్రపు పాయ (creek) కు కూడా 'డిజపాయింట్ మెంట్' అని పేరు పెట్టారు.

"శక్తి రూపాంతరం చెందడం తప్ప నశించనట్టే నిజాయితీతో చేసే కృషి ఎన్నడూ నిరర్థకం కాదు" —పాల్ ష్వైచర్

ఆమె 2.02 మీటర్ల ఎత్తు ఎగిరి కొత్త రికార్డు స్థాపించింది. అమెరికన్ మహిళ



వందనా రావు

ఎవిలిన్ ఆష్‌ఫోర్డ్ స్త్రీల 100 మీ.ల పరుగు పందెంలో 10.97 సెకనులలో పరుగెత్తి స్వర్ణపతకం సాధించింది. స్త్రీల 3,000 మీటర్



ఉష

ల పోటీలో రుమేనియాకు చెందిన మారిసికా ప్యూకా ఆ దూరాన్ని 8 ని. ల 35.96 సెకన్లలో పరుగెత్తి స్వర్ణపతకం గెలుచుకుంది. రుమేనియాలోని వ్యాయామ విద్యా ప్రవీణురాలు ఎకాటెరినా స్జాబో ఒలింపిక్ పోటీలలో 10 పాయింట్లు స్కోర్ చేసినవారిలో 8 వ మహిళ అయింది.

డేన్ ల్యూకిన్ అనే 'ట్యూనా' చేపలు పట్టే ఆస్ట్రేలియన్ కోటీశ్వరుడు బరువులు ఎత్తే పోటీలో స్వర్ణపతకం గెలిచి 'ప్రపంచంలో

## మీరైతే....?

(సెప్టెంబరు 1984)



ముఖ్యమంత్రి మారువేషంలో
మీ యింటికి వస్తే?

"నేను ఆయన అభిమానినండోయ్ -
ఏ వేషంలోనైనా ఇట్టే పసిగడతా!"

—ఎం. వేంకటేశ్వర శర్మ, చించినాడ,
(ప. గో. జిల్లా.)

* * *

"ఇండియా ప్రధానివి కమ్మని దీవిస్తా!"

—జి. ఎస్. ఫణీంద్ర దేవ్, విజయనగరం.

* * *

"చెప్పను, చేసి చూపిస్తా!"

—దత్తి మధుసూధనరావు, భూపతి పాలెం,
(తూ. గో. జిల్లా.)

---

"కష్టాలను అధిగమించడం కంటె, కొత్త కలలను కంటూ వాటిని నిజం చేసుకోడం కంటె జీవితంలో గొప్ప సుఖం మరి లేదు!" —సామ్యూల్ జాన్సన్.

మిక్కిలి బలశాలి' అనే బిరుదం పొందాడు. రెండు విభిన్న తరహాల బరువులను-మొత్తం 412.5 కిలోగ్రాములను ఆయన లేవనెత్తాడు.



షినీ అబ్రహాం

ఒలింపిక్ పోటీలలో 4 × 400 మీ.ల రిలే పరుగుపందెంలో ఇండియా మొట్టమొదటి సారిగా ఈ సారి ఫైనల్‌దాకా వచ్చింది. కాని ఇండియన్ జట్టులోని వందనా రావు, పి.టి. ఉష, షినీ అబ్రహాం, ఎం.డి. వల్సమ్మ కలిపి ఆ దూరాన్ని ని 3 ల, సె. 32 49 లలో పరుగెత్తి ఫైనల్‌లో వెనుకపడ్డారు. ఇండియా శాలూకు సుప్రసిద్ధ క్రీడాకారిణి అయిన రైల్వేల ప్రతినిధి పి.టి. ఉష 400 మీ.ల ప్రతిబంధకాల పోటీలో గమ్యం చేరిన ఇండియన్‌లలో 4 వదీ, స్త్రీలలో మొదటిదీ అయినప్పటికీ 1/100 సెకన్ల తేడాతో ఆమె కాంస్య పతకాన్ని కోల్పోయింది.

మొత్తం ఈ ఒలింపిక్ పోటీలలో 683 స్వర్ణ, రజత, కాంస్య పతకాలను బహూకరించారు. సోవియట్ యూనియన్ నుంచీ, దాని 14 మిత్రరాజ్యాల నుంచీ క్రీడాకారులు ఈ పోటీలలో పాల్గొన నందువల్ల అమెరికా అందరికంటె ఎక్కువ పతకాలను (83 స్వర్ణ, 61 రజత, 30 కాంస్య పతకాలను) సాధించింది. అమెరికా కాక కనీసం 10 స్వర్ణపతకాలైనా గెలుచుకున్న దేశాలు మరి ఆరు ఉన్నాయి: రుమేనియా, ప. జర్మనీ, కెనడా, చైనా, ఇటలీ, జపాన్, పాల్గొన్న దేశాలలో

## పాఠకుల అభిప్రాయాలు

(సెప్టెంబరు 1984)



"దైవశక్తి దారి చూపిస్తుంది
స్వశక్తి దరి చేరుస్తుంది!"

—సిరిపిల్లా రషీద్, దోమకొండ.

* * *

"మంది ఎక్కువయిన పల్చబడును చల్ల
పిల్లలెక్కువయిన కొంప అగును గుల్ల!"

—కె. జగదీశ్వరదేవ్, తూర్పుమాదుర్‌కటి, (ప. బెంగాల్.)

* * *

"యుగాలు మారినా జగాలు మారినా
మారలేదు పేదవారి బ్రదుకులు!!

—తుర్లపాటి ఆంజనేయశర్మ, వేటపాలెం, (ప్రకాశం జిల్లా.)

"సూత్రాలు విద్యార్థి మార్గాన్ని పొడిగిస్తాయి:
దృష్టాంతాలు దాన్ని తగ్గిస్తాయి!" —సెనెకా

47 దేశాలు కనీసం ఒక పతకాన్ని అయినా సాధించినవి ఉన్నాయి.



వల్సమ్మ

లాస్ ఏంజెల్స్‌లోని 'మెమోరియల్ కొలీసియమ్'లో జరిగిన ముగింపు ఉత్సవాలకు 93,000 మంది వచ్చారు. అలా ఎంతో సరదాగా ఆ ఉత్సవం ముగిసింది. లాస్ ఏంజెల్స్




ఒలింపిక్ మెడల్

తొలి నీగ్రో మేయర్ టామ్ బ్రాడ్లీ అంతర్జాతీయ ఒలింపిక్ క్రీడల సంఘం అధ్యక్షుడు జువాన్ అంటోనియో సమరాంచ్‌కి ఒలింపిక్ పతాకను అందజేయగా, ఆయన 1988లో ఒలింపిక్ క్రీడలు జరుగనున్న సియోల్ (ద. కొరియా) నగర మేయర్ టో హ్వ్యాన్ యుమ్‌కి దానిని అందజేశారు.

1984 లాస్ ఏంజెల్స్ ఒలింపిక్ క్రీడలు చూడడానికి 6 లక్షల మంది విజిటర్లు వచ్చారు. కాలిఫోర్నియా రాష్ట్ర ప్రభుత్వ ఖజానాకు ఈ క్రీడలవల్ల 330 కోట్ల డాలర్ల ఆదాయం వచ్చింది. ●

## ముఖచిత్ర వ్యాఖ్య

(సెప్టెంబరు 1984)

"నవ్వే నువ్వు - నువ్వే నవ్వు
నీ నవ్వే మల్లెపువ్వు!"

—రేగండ్ల పురుషోత్తం, కలకోట.

* * *

"లేదు నాకు ఏ దురాశా!
అందుకే అనుక్షణం ఖులాసా!!

—జి. బాబురావు, వడిశలేరు.

* * *

"శిరమున తెల్లని పువ్వు!
ముఖమున చల్లని నవ్వు!"

—కొప్పెర్ల శ్రీధర్, కడప.

"సాహిత్యం సగం వ్యాపారం, సగం కళ అయినప్పుడే అది బాగా రాణిస్తుంది." —విలియమ్ రాల్ఫ్ ఇంగె

(8 వ పేజీ తరువాయి)
టికే ఎందరో యోగులనూ, సన్న్యాసులనూ ఆయన సందర్శించి ఉన్నాడు. దేవుణ్ణి గురించీ, సత్యాన్ని గురించీ స్పష్టంగా బోధ పడేట్టుగాని, నమ్మకం కుదిరేట్టుగాని ఎవ్వరూ ఆయనకు వివరించలేకపోయారు.



స్వామీ వివేకానంద

అతని రాకకోసమే ఎదురు తెన్నులు చూస్తున్న వాడిలాగ అమితోత్సాహంతో రామకృష్ణుడు నరేంద్రుణ్ణి ఆహ్వానించాడు. అందరినీ అడిగే ప్రశ్నే నరేంద్రుడు ఆయననూ అడిగాడు-"నువ్వు దేవుణ్ణి చూశావా?" అని.

"చూశాను నాయనా! ఎదురుగా నువ్వు నాకు ఎంత నిజంగా కనిపిస్తున్నావో అంత కంటె స్ఫుటంగా దేవుడు నాకు కనిపిస్తాడు" అన్నాడు రామకృష్ణుడు. ఆయన గొంతూ, మాటలలో ధ్వనించిన నిజాయితీ నరేంద్రుణ్ణి ముగ్ధుణ్ణి చేశాయి. "నీతో నేను మాట్లాడుతున్నంత కచ్చితంగా మనం దేవుడితోనూ మాట్లాడవచ్చు!" అని రెట్టించాడు రామకృష్ణ పరమహంస.

ఆయన హస్త స్పర్శ తగులగానే నరేంద్రుడికి చిత్రమైన అనుభూతి కలిగింది. శరీరం అంతటా ఏదో దివ్య విద్యుత్తు ప్రసరించినట్లయింది. వితండ వాదం చేయడానికి వచ్చిన నరేంద్రుడు చిత్రంగా క్షణంలో ఆయనకు దాసానుదాసుడు అయాడు. సత్యాన్వేషణ యాత్రలో అతడు తుది మజిలీ చేరుకున్నాడు. ఒక ఆత్మ మరో ఆత్మను వెలిగించింది. నరేంద్రుడు రామకృష్ణుని ప్రధాన శిష్యుడు అయాడు. ఆ గురువు దయవల్ల శిష్యుడు భగవద్దర్శనం చేశాడు. తన

## భావ స్వాతంత్ర్యము

"నమ్మ శక్యం కాకపోయినా ఇది నిజం: సోక్రటీసు చేత విషం త్రాగించిన 2,380 ఏళ్ళ తరువాత, క్రీస్తును సిలువ చేసిన 1,980 ఏళ్ళ తరువాత, సర్ థామస్ మోర్ శిరస్సు ఖండించిన 435 ఏళ్ళ తరువాత, జియోర్డానో బ్రోనోను కాల్చివేసిన 370 ఏళ్ళ తరువాత - చిత్రంగా ఈ నాడు కూడా తమ స్వతంత్రాభిప్రాయాలు ప్రకటించిన నేరానికి వేలాది మంది స్త్రీలూ, పురుషులూ జైల్లో మగ్గుతున్నారు. స్వతంత్ర భావాలను నిజానికి ఎవరూ బంధించలేరు. కటకటాల వెనుక ఉన్న వారిది కాదు అవమానం, వారిని అలా బంధించిన వారిదే ఆ అగౌరవం!

—సాల్వడార్ డీ మడారియాగా

"విశ్వాసంలో, వెలుగులో నీ 'చేతనను' పెంచుకో!" —అరవింద ఘోష్

సందేశాన్ని ప్రపంచం అంతటా చాటడానికి నరేంద్రుణ్ణి ప్రధాన సాధనంగా గురువుగారు ఎన్నుకున్నారు. 'స్వామీ వివేకానంద' అనే పేరుతో నరేంద్రుడు విశ్వ విఖ్యాతుడయాడు. ఇండియా ప్రసవించిన మహా ప్రబోధకుడు, మహా ప్రవక్త అయిన వివేకానందుడు ఇలా ప్రకటించాడు: "ప్రపంచానికి ఇండియా అర్పించిన కానుక ఆధ్యాత్మిక జ్యోతి!"

ప్రగాఢమైన ఆధ్యాత్మికానుభూతులతోనూ, సుదీర్ఘ కాలం సమాధి దశలో గడపడంతోనూ, భక్తులకోసం తన సర్వస్వాన్నీ అర్పించడంతోనూ రామకృష్ణుని ఆరోగ్యం బాగా దెబ్బతింది. గొంతులో పుట్టు కురుపు (కేన్సర్) వ్యాధితో ఆయన బాధ పడ్డారు. ఎన్ని మందులు వాడినా వ్యాధి తగ్గుముఖం పట్టలేదు. డాక్టర్లూ, శిష్యులూ విశ్రాంతి తీసుకోమని ఎంత బ్రతిమిలాడినా చివరి వరకూ నిర్విరామంగా ఆయన మానవసేవ చేస్తూనే వచ్చారు. ఆర్తులై తనవద్దకు వచ్చిన శిష్యులకు ఆధ్యాత్మిక సందేశాలు అంద జేస్తూనే ఉన్నారు. ఆయన ముఖంలో బాధ కనిపించేది కాదు. ఆయన వర్చస్సు రవ్వంత కూడా తగ్గలేదు.

తన అవసాన కాలం చేరువ అయిందని గుర్తించిన రామకృష్ణ పరమహంస నరేంద్రుణ్ణి, ఇతర శిష్యులనూ దగ్గరకు పిలిచి వారికి సన్న్యాసదీక్ష ఇచ్చారు. ఆ విధంగా ఆ రోజున ప్రారంభమైంది 'రామకృష్ణ మిషన్'.

అటు తరువాత రెండు రోజులకే 1886 ఆగస్టు 16న ఒక పండు వెన్నెలరాత్రి దక్షిణేశ్వర్ యోగి మహా సమాధి చెందాడు. దేశదేశాల ప్రజలూ నేటికీ 'భగవాన్ రామకృష్ణ పరమహంస'కు అంజలి ఘటిస్తూనే ఉన్నారు.

# గడ్డం గొరిగించుకోని వారి మీద పన్ను



వివేకానికీ, సాధుత్వానికీ, సమర్థతకూ చిహ్నంగా అనాది కాలంనుంచీ 'గడ్డం' భావించబడుతూ వచ్చింది. మధ్యయుగాల యూరప్ చరిత్రలో గడ్డాన్నీ, మీసాలనూ ఒక్కొక్క వెంట్రుకే పీకడం ఒక దండనగా విధించబడేది. ఫ్రాన్స్ రాజు 7 వ లూయీ గడ్డం విలక్షణమైన ఆయన వ్యక్తిత్వానికి నిదర్శనం. ఒక మతాధికారి మెప్పుకోసం ఆయన గడ్డం తీసివేయగా ఆ కారణంగా భార్య ఆయనకు విడాకు లిచ్చింది. గడ్డం తీసివేయడం వల్లే శతవర్ష యుద్ధంలో ఆయన ఓడిపోయాడని నమ్మే వారు కూడా ఉన్నారు. 18 వ శతాబ్దంలో రష్యన్ జార్ (చక్రవర్తి) పీటర్ గడ్డం పెంచిన వారి మీద 100 రూబుల్‌లు పన్ను విధించాడు.

"మూఢాచారాల నుంచి ముక్తుడైన వాడికి మృత్యుభయం ఉండదు." —గురు నానక్

# పోటీలు

నవంబరు 1984

'విస్డమ్' పోటీలలో ఎవరైనా పాల్గొన వచ్చు. ఏ ఎంట్రీ కా ఎంట్రీ విడిగా పావు ఠావు సైజుకు తగ్గని కాగితం మీద వ్రాయాలి. ప్రతి ఎంట్రీమీదా అడ్రస్సు ఉండాలి. ఒకే కాగితం మీద ఒకటి కంటె ఎక్కువ ఎంట్రీలు వ్రాస్తే పరిశీలించబడవు. సరియైన, లేదా మేలైన ఎంట్రీలు చాలా ఉంటే లాటరీ పద్ధతిలో ఎన్నికైన ముగ్గురు విజేతలకు రు. 10 లు, రు. 7 లు, రు. 5 లు ఖరీదు చేసే పుస్తకాలు బహుమతులుగా పంపబడును. విజేతల ఎన్నికలో సంపాదకునిదే తుది నిర్ణయం. ఎంట్రీలకు 'పోటీ కూపన్' (ఒక ఎంట్రీకి చాలు) అంటించి పంపాలి. ఒక కూపన్‌తో ఒకేసారి ఎన్ని ఎంట్రీ లయినా పంపవచ్చును. ఎంట్రీలు అందవలసిన ఆఖరు తేదీ: నవంబరు 20, 1984. పంపవలసిన చిరునామా: పోటీల నిర్వాహకుడు, తెలుగు "విస్డమ్", 9, దేశికా రోడ్డు, మైలాపూరు, మద్రాసు - 600 004.

—సంపాదకుడు.

## వ్యాసం

'పౌరుల బాధ్యతలు' అనే అంశం మీద 300 మాటలకు మించకుండా వ్యాసం వ్రాసి పంపండి.

## క్విజ్

1. 23 వ ఒలింపిక్ క్రీడల పోటీలలో ఇండియన్ పురుషుల హాకీ జట్టు కెప్టెన్ ఎవరు? 2. సోవియెట్ యూనియన్ రాజధాని ఏది? 3. 'ఇంగ్లీష్ ఫిలిమ్' 'గాంధీ'లో గాంధీ పాత్ర ధరించింది ఎవరు? 4. 'వాటర్ గేట్ స్కాండల్' ఏ దేశం అధ్యక్షుడికి సంబంధిం

---

## జర్మన్ ఫిలిమ్‌కు 'గోల్డెన్ పామ్' అవార్డు

'పారిస్, టెక్సాస్' అనే జర్మన్ ఫిలిమ్ ఇటీవల కేనీస్‌లో జరిగిన వార్షిక చలన చిత్రోత్సవంలో అత్యున్నత గౌరవం అయిన 'గోల్డెన్ పామ్' అవార్డును అందుకుంది. 'అమ్నీషియా' అనే వ్యాధివల్ల జ్ఞాపక శక్తిని కోల్పోయిన ఒక వ్యక్తి 'టెక్సాస్' రాష్ట్రంలోని 'పారిస్' అనే చిన్నపట్టణంలో మరచిపోయిన తన కుటుంబ సభ్యులను తిరిగి చేరుకునే ఒక రసవత్ కథ ఈ చిత్రం!

చింది? 5. ఈ క్రింది జంటలలో ఏది తప్పు? (ఏ) సాంచి - మహారాష్ట్ర, (బి) సారనాథ్- ఉ. ప్రదేశ్, (సి) కుతుబ్ మీనార్-ఢిల్లీ (డి) బుద్ధగయ-బీహార్ 6. లైనో టైప్ ఈ క్రింది వానిలో దేనికి సంబంధించింది? (ఏ) వస్త్ర పరిశ్రమ, (బి) ప్రింటింగ్, (సి) పెయింటింగ్, (డి)ఎలెక్ట్రిక్ టైప్ రైటింగ్, 7. 1983 నవంబరులో ఢిల్లీలో జరిగిన కామన్‌వెల్త్ రాజ్యాధినేతల సభ ప్రతినిధులకు 2 రోజుల విశ్రాంతి కేంద్రంగా ఎంచుకున్న పట్టణం ఏది? 8. 1982 లో ఢిల్లీలో జరిగిన 9 వ ఆసియా క్రీడోత్సవాలలో వాయించిన గీతానికి సంగీత రచయిత ఎవరు?

## పజిల్



ఆధారాలు - అడ్డం: 1. తెనాలి రామలింగడు ఎలాంటి కవి? 4. విజయ నగరం జిల్లాలోని ఒక సంస్థానం, 6 'మనిచెడి'కి వ్యావహారిక రూపం, 7. 'జవనికలా'కు రూపాంతరం, 8. 'చారుడు' ఉద్యోగానికి నేర్వవలసిన విద్య, 9 'చొక్కాలు వేరు —వేరు', 10. బుద్ధిని మూర్తిలో కనిపించే ప్రధాన రసము, 12. 'పడుచు కోడలు'కి వ్యతిరేకం, 14. 'పచ్చ' సంస్కృతంలో, 16. భారతంలోని ఒక ఉపాఖ్యానంలో 'సుకన్య'ను పెండ్లాడిన ముని.

నిలువు: 1. చేమకూర వేంకట కవి వ్రాసిన కావ్యము, 2. టక్కు + నిక్కు, 3. విమల, చారుదత్తుల నాయికా నాయకులైతే ఆ కావ్యానికి ఏమని పేరు పెట్టవచ్చు? 4. శ్రీకృష్ణుని బాల్యమిత్రుడు, 5. శ్రీకృష్ణ రాయబారము నాటకానికి మరో పేరు, 11. జాకెట్టుకి పూర్వరూపం, 13. 'విధవ'కు వ్యతిరేకం. 15. 16 అడ్డంలో చివరి 2/5 వ వంతు

## స్త్రీల నడక పందెంలో ప్రపంచ రికార్డు

ఇటీవల కోపెన్ హేగెన్ (డెన్మార్కు) లో జరిగిన 50 వ అంతర్జాతీయ నడక పోటీలలో స్త్రీల విభాగంలో యాన్ హాంగ్ అనే చైనా మహిళ 10,050 మీటర్ల దూరాన్ని 45 ని. ల 40 సె. లలో నడిచి కొత్త ప్రపంచ రికార్డు స్థాపించింది. ఆ దూరాన్ని 47 ని. ల, 34 సె లలో నడిచిన ఆస్ట్రేలియా మహిళ 'సుసాన్ కుక్'కు బహుమతి లభించింది.

"నెలాఖరు రోజులలో బ్రదికినట్టు నెల మొదటి వారంలో కూడా జీవించడంలో ఉంది 'పొదుపు' కీలకం!"

# తెలివికి పరీక్ష

1. 3. 8. 15, 21, —ఈ వరుసలో తరువాతి రెండు సంఖ్యలు చెప్పండి, 2. అతడు వాడికి ఎట్లాగో, ఆమె — అట్లా? (ఏ) నాకు, (బి) వారికి, (సి) ఆమెకు, (డి) మనకు, 3 అతడు ఉద్విగ్నుడుగా ఉన్నాడు అంటే ఏమని అర్థం? (ఏ) దుఃఖములో ఉన్నాడు (బి) ఆవేశంలో ఉన్నాడు, (సి) చికాకులో ఉన్నాడు, (డి) ఉత్సాహంగా ఉన్నాడు, 4 భాగం (పాలు) క్షీరం, నీరు ( ) బ్రదుకు - బ్రాకెట్లను సరియైన మాటతో పూరించండి. 5. 347 (418) 489; 643 ( ) 721—బ్రాకెట్లలో ఉండవలసిన సంఖ్య ఏది?, 6. న్యూఢిల్లీ, రంగూన్, బాంగ్‌కాక్ మద్రాసు, టోకియో, కేన్‌బెరా, వెల్లింగ్‌టన్ - ఈ సముదాయంలో ఇముడని నగరం ఏది? 7. ఈ వేపు నుంచి చూస్తే 'ఓష్ఠం' ఆ వేపు నుంచి చూస్తే 'కదల్చె' — ఆ మూడు అక్షరాల మాట ఏది? 8. "పక్షులు ఎగరడం, దూకడం మాత్రమే చేస్తాయి; కీటకాలు పాకగలవు"—కాబట్టి (ఏ) పక్షులు కీటకాలను ఆరగిస్తాయి, (బి) పక్షులు పాకవు, (సి) పక్షులు అప్పుడప్పుడు పాకుతాయి — ఏది రైటు?

---

## సంస్కృత చలన చిత్రం 'ఆది శంకరాచార్య'

ఇటీవల ఢిల్లీలో ప్రకటించిన 1983 జాతీయ చలన చిత్రోత్సవపు అవార్డులలో సంస్కృత భాషలో తీసిన మొట్టమొదటి చలన చిత్రం 'ఆదిశంకరాచార్య' అత్యుత్తమమైన ఫీచర్ ఫిల్మ్ అవార్డు అందుకుంది.

# మాటల మహిమ

ఈ క్రింది మాటలకు సరియైన అర్థాన్ని/అర్థాలను గుర్తించండి.

1. అనుకరణం: (ఏ) ఒక రకం యుద్ధం, (బి) అనుకరించడం, (సి) కలిపి పని చెయ్యడం, (డి) పోలిక.

2. అనుక్రోశం: (ఏ) క్రోసెడు దూరం, (బి) ఉక్కు రోషం, (సి) దయ, (డి) కోపం.

3 అనుచితం: (ఏ) ఊరికే ఇవ్వవిది, (బి) తగనిది, (సి) చితిలో మిగిలేది, (డి) అపరిచితం.

4. అనునయం: (ఏ) ఓదార్చడం, (బి) నిరంతరం, (సి) ఒక రకపు రాజనీతి, (డి) బతిమాలడం.

5. అనునాసికం: (ఏ) ముక్కెర, (బి) గోదావరి పుట్టిన చోటు, (సి) ముక్కుతో పలికే వర్ణం, (డి) ముక్కు పుడక.

6. అనుమానం: (ఏ) అవమానం, (బి) సంశయం, (సి) ఒక కొలత, (డి) ఒక అర్థాలంకారం.

7. అనువాకం: (ఏ) నిర్వాకం, (బి) వాక్కు ననుసరించేది (సి) ఒక రకపు వేద

ముక్కు; (డి) ఎల్లప్పుడు.

8. అనుశాసనం: (ఏ) ఉప శాసనం, (బి) ఆజ్ఞ, (సి) వ్యాకరణం, (డి) ఉప దేశం.

విస్డమ్
పోటీల కూపను
నవంబరు 1984

## ముఖచిత్ర వ్యాఖ్య

ఆరు మాటలకు మించకుండా ఈ సంచిక ముఖచిత్రానికి తగిన శీర్షిక వ్రాసి పంపండి.

## పాఠకుల అభిప్రాయాలు

దైనందిన జీవితంలో మీకు ఎదురయ్యే ఏ సంఘటనను గురించి అయినా ఒకటి రెండు వాక్యాల్లో చమత్కారమైన వ్యాఖ్య వ్రాసి పంపండి. ఉత్తమ వ్యాఖ్యకు రు. 5 లు ఖరీదు చేసే పుస్తకం బహుమతి.

## మీరైతే.....?

"దయ్యం ఎదురైతే...?" మీరైతే ఏం చేస్తారు? క్లుప్తంగా, చమత్కారంగా ఉండే జవాబు వ్రాయండి.



8 మాటలకు మించకుండా పైన కనిపిస్తున్న రెండు చిత్రాలనూ పరిశీలించి వాటికి వర్తించేట్టు చమత్కారమైన, లేదా ఆలోచన రేకెత్తించే శీర్షికను సూచించండి.

## 1984 ఉత్తమ క్రీడాకారులు

'అమెచూర్ అథెలెటిక్ ఫెడరేషన్ ఆఫ్ ఇండియా' వారు పురుషులలో 'సర్వీసెస్‌కు' చెంద్ రామ్‌నీ, స్త్రీలలో రైల్వేలకు చెందిన పి. టి. ఉషనూ 1984 ఉత్తమ క్రీడాకారులుగా ప్రకటించారు

"విజయం సాధించేదాకా ఆటలో ఓడిపోయినట్టు కాదు.' —జార్జ్ క్రాచ్

# పోటీలు (ఫలితాలు)

(సెప్టెంబరు 1984)

వ్యాసం: మొదటి బహుమతి: వి. విద్యా సాగర్, తాడిపత్రి; రెండవ బహుమతి: ఇంద్రగంటి శ్రీగీత, విశాఖపట్నం-530016; మూడవ బహుమతి: యస్. యన్. హుస్సేన్, నాగార్జున సాగర్.

క్విజ్ - జవాబులు: 1. హూస్టన్, 2. 158, 3 1950 జనవరి 26, 4. (బి) నైట్రస్ ఆక్సైడ్, 5 పోర్ట్ బ్లెయిర్, 6. బాక్సింగ్, 7. 35 ఏళ్ళు, 8. డెమోగ్రఫీ

విజేతలు: మొదటి బహుమతి: ముంతాజ్ ఖాన్, బైంస (ఆదిలాబాద్ జిల్లా); రెండవ బహుమతి: కుమారి పి అపర్ణ, తెనాలి; మూడవ బహుమతి: గురిజాల నాగరాజు, శ్రీకాళహస్తి.

పజిల్-జవాబులు-అడ్డం: 1. తిన వేం?, 3 సటీక, 6. కలము, 7. అవుడు, 9. అసక్వ, 10. ముసలితనం. 13 చంద్రిక, 15. చకోరి, 16. వినాశకము, 18. తిరుమల వేంకటేశ్వరా!

నిలువు. 1. తి, ధ, రుం, అ, 2. వేంకటేశ్వర కవి, 3. సముద్రము, 4. కల 5. మోడు. 8. వుడుత, 11. లికుచములచే! 12. నండూరి సితారా, 13. చంద్రమతి. 14. ఆశ, 17. నారల

విజేతలు: మొదటి బహుమతి: బందరు దుర్గాప్రసాద్, కవిటి, శ్రీకాకుళం జిల్లా; రెండవ బహుమతి: ఐ.వి. రఘురామమూర్తి మాచర్ల, గుంటూరు జిల్లా; మూడవ బహుమతి: వి. రామచంద్రమూర్తి, జిల్లెళ్ళమూడి.

తెలివికి పరీక్ష — జవాబులు: 1 34, 2. 55, (బ్రాకెట్ల కిరువైపులా ఉన్న సంఖ్యల తేడాని 11 చే గుణిస్తే బ్రాకెట్‌లో సంఖ్య వస్తుంది), 3. సూర్యుడు, 4 'సాయం'. 5. 9 (ఇది ఒక్కటే విభాజ్య సంఖ్య; తక్కిన వన్నీ అవిభాజ్యాలు). 6 అనుకరణం, 7. తనకు [illegible]ంగా పేరు వ్యక్తిత్వం లేనివాడు, (బి) అని కుక్కలూ మాట్లాడ లేవు.

విజేతలు - మొదటి బహుమతి బి. సుజాత, బూర్జ, శ్రీకాకుళం జిల్లా రెండవ బహుమతి: ఐ. రామకృష్ణ, విశా[illegible] పట్టణం; మూడవ బహుమతి: పి. శ్రీనివా[illegible] కుమార్, విజయవాడ.

మాటల మహిమ - జవాబులు: 1

---

## మిక్కిలి ఎక్కువ 'నిరుద్యో[illegible]' ఇచ్చే దేశం

యూరప్‌లోని డెన్మార్క్ దేశం నిరుద్యో[illegible] గా ఉన్న తన పౌరులకు ప్రపంచం అం[illegible]టిలో మిక్కిలి ఎక్కువ 'భరణం' ఇస్తూం[illegible]

(బి)చిట్టాముదం, (డి) రామునికి విశ్వామిత్రుడు ఉపదేశించిన విద్య. 2. (బి) వాక్యాలలో ఒక దోషం, 3. (ఏ) మీరినది (డి) భూతకాలం, 4. (బి) సప్తర్షులలో ఒకడు, (డి) అనసూయ భర్త, 5. (సి) సమయం, 6. (సి)అలా కాకపోతే, (డి) పక్షాంతరంలో, 7. (బి) కనిపించనిది. (సి) అనుకోకుండా కలిగే మేలు. 8. (బి) దర్పణం, (డి) ముకురం.

విజేతలు - మొదటి బహుమతి: ఎస్. మధుసూదన రావు, వసుంధర, శ్రీకాకుళం జిల్లా; రెండవ బహుమతి: ఏ. మాధవీ లత, కదిరి; మూడవ బహుమతి: మహమ్మద్ ఆరిఫ్ అలీ, రాజమండ్రి.

ముఖచిత్ర వ్యాఖ్య - మొదటి బహుమతి: రేగిండ్ల పురుషోత్తం, కలకోట; రెండవ బహుమతి: జి బాబురావు, వడిశలేరు, (తూ.గో. జిల్లా); మూడవ బహుమతి: కొప్పెర్ల శ్రీధర్, కడప.

పాఠకుల అభిప్రాయాలు - మొదటి బహుమతి: పిరిసిల్లా రషీద్, దోమకొండ (నిజామాబాద్ జిల్లా); రెండవ బహుమతి: కె. జగదీశ్వరదేవ్, తూర్పు మాదుర్‌కటి (ప.బెంగాల్); మూడవ బహుమతి: తుర్లపాటి ఆంజనేయశర్మ,వేటపాలెం, (ప్రకాశంజిల్లా).

మీరైతే? - మొదటి బహుమతి: ఎమ్. వేంకటేశ్వర శర్మ, చించినాడ. (ప గో. జిల్లా); రెండవ బహుమతి జి ఎస్. ఫణీంద్ర దేవ్, విజయ నగరం; మూడవ బహుమతి: దత్తి మధుసూదనరావు, భూపతి పాలెం (తూ.గో. జిల్లా).

భావ పరిచయ పోటీ - మొదటి బహుమతి: కె పవన్ కుమార్, కరీం నగర్, రెండవ బహుమతి: ఎస్ మధుసూధనరావు, వసుంధరపోస్టు (శ్రీకాకుళంజిల్లా), మూడవ బహుమతి: కోవూరి రవికుమార్, తెనాలి.

## కృత్రిమ చర్మం ఉత్పాదన



అమెరికాలో మెసాచుసెట్స్ లోని 'జనరల్ హాస్పిటల్', 'ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ'లలోని శాస్త్ర పరిశోధకులు ప్రపంచంలో మొట్టమొదటిసారిగా కృత్రిమ చర్మం ఉత్పత్తిచేసే ప్రక్రియ కనుగొన్నారు. షార్క్ చేప 'మెత్తని ఎముక' (cartilage) ను పొడిచేసి. ఆవు చర్మంనుంచి తీసిన కొల్లాజెన్ (చర్మంలో ఉండే ప్రధాన పదార్థం) ద్రావణంలో ఆ పొడిని కలిపి, దానిని ఒక పెద్ద పెనంమీద పల్చగా పోసి శీతలీకరణ ద్వారా ఆరబెట్టి పల్చని, తెల్లని, రంధ్రాలుగల షీట్‌లు తయారుచేసి. తగు విధంగా వాటిని భద్రపరుస్తారు. కృత్రిమ చర్మంగా శరీరం మీద అతకటానికి అవి ఉపయోగపడతాయి.

"పరాయివారి ఆరోగ్యం కోసం మధువు త్రాగకు. నీ ఆరోగ్యాన్ని నువ్వు కోల్పోతావు."

